# సంస్కృత
# వ్యాకరణ సంగ్రహము

(శబ్దమంజరి, ధాతుమంజరి, సంధి, సమాస, కర్తృ-
కర్మవాచ్య, కారక, తద్ధిత, కృదంత, స్త్రీప్రత్యయ-
అనువాదఅభ్యాస, లఘువ్యాఖ్యలతో)



ప్రకాశకులు :

**సాహితిసదన్**

141, టి. నగర్, తిరుపతి.

శ్రీ యై న మః

శ్రీనివాసాయనమః

నిరుపమ గుణసింధు ర్నిత్య లక్ష్మీసమేతః
నిఖిల నిగమ వేద్యో నిస్తులో వేఙ్క టేశః।
నిజచరణ సమర్చా సక్తభక్తౌఘ రక్షీ
నివసతు హృదయే మే స్వాంఘ్రి భక్తింవితన్వన్॥

యేనాక్షరసమామ్నాయమధిగమ్య మహేశ్వరాత్।
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః॥

యేన ధౌతా గిరః పుంసాం విమలైశ్శబ్దవారిభిః।
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః॥

వాక్యకారం వరరుచిం భాష్యకారం పతఞ్జలిమ్।
పాణినిం సూత్రకారంచ ప్రణతోఽస్మి మునిత్రయమ్॥

ఓం నమః పాణినికాత్యాయనపతఞ్జలిభ్యః శబ్ద విద్యా సంప్రదాయ ప్రవర్తకేభ్యో వంశర్షిభ్యో మహద్భ్యో మునిభ్యో గురుభ్యః.



ముద్రణ. క్రాంతి ప్రెస్, మద్రాసు-1.

# నివేదన

సంస్కృత వ్యాకరణ మొక మహాసాగరము. దాని రచనా-ప్రణాళిక యొక యద్భుతము. అందు ప్రవేశించిననే కాని లోతు తెలియదు, కాదు ప్రవేశించినను లోతు తెలియదు. అది తొలుత సూత్రప్రాయమయ్యు, మహాభాష్య, తద్వ్యాఖ్యానాదులవఱకు విస్తరించి, నేటి నవీన విమర్శనా మార్గమున మరింత విపులమై విరాడ్రూపము దాల్చినది.

లక్ష్యము కొలది ఫలము. ఈ పుస్తకము వెలయించుటలో మా లక్ష్యము జిజ్ఞాసువులకు సుబోధముగ సంస్కృత వ్యాకరణ పరిచయము కలిగించుటయే అందులకు లభించిన 'ప్రాచీన - నవీన' వ్యాకరణ గ్రంథముల నారవడి చేసికొంటిమి. ప్రథమ ప్రయత్నము 'గచ్ఛతః స్ఖలనం క్వాపి'. సహృదయు లిందలి గుణములు గ్రహింతు రని విశ్వాసము. ఇంక మా ప్రయత్న మెంతవఱకు ఫలించినదో తెలుపవలసినవారు పాఠకులు.

మే మిట్టి సాహస మొనరించుటకు పండిత మిత్రులు శ్రీమాన్ E. గోపాలకృష్ణమాచార్యులు, శ్రీమాన్ T. A. గోపాలన్ గార్ల ప్రోత్సాహము, పర్యవేక్షణ కారణము. ఇందలి గుణములకు వారే కొనియాడ దగుదురు, దొసగులు మావి. సహృదయుల సూచనలు ముందు ముద్రణకు మెఱుగు దెచ్చునని వారి సూచనల నాహ్వానించుచున్నాము.

మా కృషిని ప్రోత్సహించుచు తమ యమూల్యాభిప్రాయము వెలిబుచ్చిన శ్రీయుతులు డాక్టరు ఆచార్య జి. ఎన్. రెడ్డి (ఆంధ్రశాఖాధ్యక్షులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి) గారికి, మా ప్రయత్నము ప్రశంసించిన శ్రీయుతులు డాక్టర్ కోరాడ మహాదేవశాస్త్రి (స్పెషల్ ఆఫీసరు, పి. జి. సెంటర్, అనంతపురం) గారికిని మా హార్దిక కృతజ్ఞతలు.

యీ గ్రంథము నిట్లు సర్వాంగ సుందరముగ ముద్రించి యిచ్చిన 'ముద్రాపక చక్రవర్తి' 'మిత్రరత్నము' శ్రీ ధనికొండ హనుమంతరావు (క్రాంతిప్రెస్ అధినేత) గారి నేమని పొగడుదుము? నిజముగ ధనికొండ మాకు కొండంత యండ. వారి సహకారముననే గ్రంథమింత స్వల్ప వ్యవధిలో ముద్రింప సాధ్యమైనది. వారికి మా కృతజ్ఞతలు.

## కృతజ్ఞతాంజలి

మా ప్రార్థన మన్నించి, ప్రతిఫలమున కాసపడక కేవల మైత్రీ భావముతో యీ గ్రంథమును సంస్కృత జిజ్ఞాసువులకై సిద్ధపరచి మాకు సకాలమున అందించిన రచయితలకు మా హార్దిక కృతజ్ఞతలు.

ప్రకాశకులు.

ఆచార్య జి. యన్. రెడ్డి, యమ్.ఏ; యమ్. లిట్, పిహెచ్.డి.
ఆంధ్ర శాఖాధ్యక్షులు, డీన్-ఫాకల్టి ఓరియంటల్ లర్నింగ్,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి.

భారతీయ సంస్కృతి, చరిత్ర విజ్ఞానాదులకు సంబంధించిన విశేషాంశములను తెలుసుకోవాలనే జిజ్ఞాసువులకు 'సంస్కృతభాషా పరిచయం ముఖ్యం. భారతీయ భాషా సాహిత్య విద్యార్థులకు సంస్కృతాధ్యయనం అవసరం, అందులో తెలుగు భాషాసాహిత్యాధ్యయనపరులకు, తెలుగు రచయితలకు సంస్కృతభాషా ప్రవేశం అనివార్యం. అయినా తెలుగు విద్యార్థుల్ని దృష్టిలో పెట్టుకొని, వారికి అనువుగా అనుకూలంగా ప్రత్యేకించి రచింపబడిన సంస్కృత వ్యాకరణాలు, పాఠ్యగ్రంధాలు ఇంతవరకు లేవు. పాశ్చాత్యులకు, ప్రాథమికవిద్యార్థులకు ఉద్దేశింపబడిన భండార్కర్ పుస్తకాలే—వంద సంవత్సరాలకు ముందు రచింపబడినట్టివి—మనకందరికీ ఇంకా శరణ్యం. తెలుగు విద్యార్థులకు సంస్కృతాన్ని నేర్పడంగాని బోధించడం కాని సులభమని నా నమ్మకం. ఎందుచేతనంటే, ఉన్నత పాఠశాల విద్య పూర్తి అయ్యేసరికి తెలుగు విద్యార్థికి సంస్కృత పదజాలం, సమాసాలు వీటి అర్థాలు చాలావరకు సుపరిచితం అయివుంటుంది. ఇక తెలుకోదగింది పదప్రత్యయ సంబంధస్వరూపం, పదనిష్పన్నవిధానం, వాక్యరచనారీతి ఇత్యాది. ఇట్టి విశేషాంశాలను సోపానక్రమంలో వివరించే పాఠ్యగ్రంధాలు **(Graded Readers)** ఉన్నట్లయితే సంస్కృతాన్ని మన కళాశాలా విద్యార్థులు చాలావరకు స్వయంగా నేర్చుకోవచ్చుని నా అభిప్రాయం.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో బి.ఏ. తరగతుల్లో తెలుగును ప్రధాన విషయంగా ఎన్నుకొనే విద్యార్థులకు సంస్కృతభాషా పఠనం

విధిగా నియమితం. దానికి సంబంధించిన పాఠ్యప్రణాళిక గూడ నిర్ణీతమై ఉంది. అట్టి పాఠ్యప్రణాళికను దృష్టిలో పెట్టుకొని శ్రీ కనకగిరి కృష్ణమాచార్యులు, శ్రీ చలమచర్ల వెంకటశేషాచార్యులు ఈ గ్రంథాన్ని రచించినారు. ఇందులో వివిధ ప్రకరణాంతర్గతాలైన వివరాలు బి.ఏ. విద్యార్థులకే కాక, వాళ్ళకు సంస్కృతాన్ని బోధించే అధ్యాపకులకు కూడ ఉపయోగకారి అని నాకు తోస్తుంది. ఎం. ఏ. విద్యార్థులకు కూడ ఈ గ్రంథం ఉపయోగపడవచ్చు. ఇట్టి గ్రంథాన్ని కూర్చి ప్రచురించిన శ్రీ కృష్ణమాచార్యులు-శ్రీ చలమచర్ల వెంకటశేషాచార్యులు అభినందనీయులు.

(Sd.) జి. యస్. రెడ్డి.
4-2-76

యస్. వి. యూనివర్సిటీవారి 'బి.ఏ.' అడ్వాన్సు తెలుగుపార్టు లోని సంస్కృత వ్యాకరణ ప్రణాళిక-(III పేపరు-మార్కులు 60)

(A) శబ్దములు— రామ, హరి, ధాతృ, పితృ, గో, రమా, గౌరీ, ధేను, వధూ, మాతృ, జ్ఞాన, వారి, శుచి, మధు, కర్మ, జలముక్, భిషక్, మరుత్, పచత్, ధీమత్, దివిషద్, రాజన్, ఆత్మన్, గుణిన్, వేధస్, శ్రేయస్, విద్వస్, అప్, గిర్, దివ్, జగత్, హృద్, నామన్, మనస్, *సర్వ, తద్, ఏతద్, యద్, కిమ్, ఇదమ్, అదస్ (*నుండి 3 లింగము లలో) యుష్మద్, అస్మద్.

(B) సంధులు—సవర్ణదీర్ఘ 23 గుణ 24 వృద్ధి 24 యణాదేశ 24 అయవయవాదేశ 24 పూర్వరూప 24 పరరూప శ్చుత్వ 25 ష్టుత్వ 26 జ_స్త్వ 27 చత్వ 27 అనునాసిక 26 లకారాదేశ 27 జముడాగమ 26 తుగా గమ 27 స్వాది 28 అన్ని విసర్గసంధులు 28-29.

(C) ధాతువులు—

1-భ్వాది వికరణము—భూ, గమ్, నీఞ్, పత్, రక్ష్, వస్, సృ, చర్, జీవ్, త్యజ్, దహ్, నమ్, పచ్, జి, దృశ్, ధావ్, యజ్, పా, వహ్, స్మృ, హృ, చల్, నిన్ద్, శంస్, ద్రు, రుహ్, స్థా, కమ్ప్, భాష్. యత్, లభ్, వన్ద్, వేప్, శ్లాఘ్. సహ్, సేవ్, భిక్ష్, యాచ్, హస్,

4 దివాదులు—దివ్, నశ్, నృత్, పుష్, తుష్, శుష్, కుప్, క్లిష్, శమ్, యుధ్.

6 తుదాదులు—తుద్, ఇష్, ప్రచ్ఛ్, - సృజ్, విశ్, స్పృశ్, మృ, లజ్జ్, విద్, ముచ్.

10 చురాదులు—చుర్, రచ్, పూజ్, తడ్. పీడ్, గణ్, చిత్, కథ్, ఘుష్, భూష్

(i) పై ధాతువులకు లట్, లృట్, లోట్, లఙ్, విధిలిఙ్‌లు.

(ii) పై ధాతువులకు క్రింది రూపములుకూడ నేర్చుకొనవలయును-

a) కర్మార్థకధాతు b) రూప నిర్మాణక్రమము c) కృదంత d) క్త్వాంత e) క్త్వాంత f) తుమున్ g) శతృ, శానచ్.

## ఇంటర్ సంస్కృత వ్యాకరణ పాఠ్యప్రణాళిక

(a) శబ్దములు—అజంత సాధారణ శబ్దములు, శ్రీః 6 స్త్రీః 7 యద్, తద్, కిమ్, అస్మద్, యుష్మద్, భిషక్, మరుత్, ఆత్మన్, గుణిన్, మనస్, విద్వస్,

(b) 'సేట్' పరస్మైపది ఆత్మనేపదులలో లట్, లఙ్, విధిలిఙ్, లోట్, లృట్ రూపములు 1-4-6-10 వికరణములలో మాత్రమే. 2వ వికరణములో 'అస్' కూడ.

(c) ద్వంద్వ, తత్పురుష బహువ్రీహులలోని సాధారణ రూపములు-

శబ్ద, ధాతు, సమాసములలో ప్రతి ప్రధాన విభాగములోను కనీసము 'రెండేసి' చొప్పున కంఠస్థము చేయవలెను. వాని నాధారముగా పెట్టుకొని పాఠ్యగ్రంధములలోని శబ్దాదుల గుర్తించుట నేర్చుకొనవలయును.

సమాస విగ్రహ రూపములగూడ నేర్చుకొనవలయును.

## ఓరియంటల్ హైస్కూల్సు వ్యాకరణ పాఠ్యాంశము

VIII తరగతి ధాతువులు—భూ, జీ. శ్రు, పా, దృశిర్, స్థా, గమ్లు, హన, ఖిదిర్, కృ, ముద, పఠ్, అర్థ్, క్రీ, గ్రహ్, చుర్, ఖాద్, పచ్, నాశ్, జ్ఞా, వద్, అస్, దా, నృత్, జనీ, వృఙ్, ప్రచ్ఛ్, ముంచ్, విద్, శీ, యజ్, లభ్, సహ్, నీ, యత్, ఏధ్, వంద్, రమ్, రాజృ, లిఖ్. సాధారణ శబ్దములు.

IX తరగతి. శతృ, శానచ్, క్త, క్త్వా, తుమున్-

X తరగతి: కృత్ తృచ్, ణిచ్, తవతు, సన్, వతుప్, తద్ధిత, అపత్య, సామూహిక, భావార్థక, తర, తమ, అవ్యయ, దేవతార్థక, అధీతి, వేత్తి, సతి సప్తమి, అనాదరషష్ఠి.

సంఖ్యలు పేజీల సంఖ్యను తెలుపును.

# విషయసూచిక

# శబ్దసూచి

## సంఖ్యలు పేజీలను తెలుపును

# ధాతు సూచి

ఈ పుస్తకమున ధాతు రూపముల ప్రయోగమును లక్ష్యమందిడుకొని 'ఇత్సంజ్ఞక' వర్ణముల వదలి ప్రయోగరూపముల మాత్రమే చూపితిమి. శాస్త్రప్రయోజనము మాత్రమే-ఇత్సంజ్ఞకములు.

ఉదా. ధాతు పాఠమున 'డుకృఞ్' అని వున్నదాని నిట 'కృ' గాను 'గమ్లృ' అను దానిని 'గమ్' గను చూపితిమి—

# వర్ణోచ్చారణ స్థానములు

1. అకుహవిసర్జనీయానాం కంఠః, 2. ఇచుయశానాంతాలు,
3. ఋటు రషాణాం మూర్ధా, 4. ఌతులసానాం దన్తాః,
5. ఉపూపధ్మానీయానామోష్ఠౌ, 6. ఞమఙణనానాం నాసికాచ,
7. ఏదైతోః కంఠతాలు, 8. ఓదౌతోః కంఠోష్ఠమ్,
9. వకారస్య దన్తోష్ఠమ్, 10. జిహ్వామూలీయస్యజిహ్వామూలమ్,
11. నాసికా అనుస్వారస్య

ఏక మాత్రో భవేద్ధ్రస్వో, ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే।
త్రిమాత్రస్తు ప్లుతోజ్ఞేయో, వ్యఞ్జనస్త్వర్ధమాత్రకమ్॥ 1
కర్తా చ కర్మ కరణం। సంప్రదానం తథైవ చ।
అపాదానాధికరణే. ఇతి షట్ కారకాణివై॥ 2
రామో జనాన్ధనైః కీర్త్యై దారిద్ర్యా న్నగరే పితుః।
రక్షత్యాలోచ్య శాస్త్రార్థం ధర్మజ్ఞో రాజసత్తమః॥ 3

* (1) రామో విరాజతే, (2) రామో భూమండల మపాలయత్। 1
(3) ఉపార్జితా చ రామేణకీర్తి రన్యా దృశీ భువి॥ 4
(4) రామచంద్రో దశగ్రీవం పరలోకమనీనయత్।
(5) బంధయామాస కపిభిస్సేతుం సీతాపతి స్స్వయమ్॥ 5
(6) వాయుపుత్రేణ రామేణ లఙ్కా—ఽకారి చ భస్మసాత్।
(7) దశాస్యో జానకీశేన త్రివిష్టపమనాయిచ॥ 6
(8) వసుదేవేన దేవర్షిర్హా రిస్సంస్మారితో గుణైః।

---

* 1. అకర్మక కర్తరి ప్రయోగము, 2. సకర్మక కర్తరిప్రయోగము, 3. కర్మణి, 4. ద్వికర్మక కర్తరి, 5. ద్వికర్తృక కర్తరి, 6. ద్వికర్తృక కర్మణి, 7. ద్వికర్మక కర్మణి, 8. కర్మకర్తరి, 9. భావే ప్రయోగము. ఇట్లు ప్రయోగములు తొమ్మిది విధములు.

పూజ్యతే చ స్వయం రామో, 9. రామచంద్రేణ భూయతే॥ 7
లడ్వర్తమానే లేడ్వేదే భూతే లుఙ్లఙ్లిట స్తథా।
విధ్యాశిషోస్తు లిఙ్లోటౌ ల్భుఙ్లృడ్లుట్చ భవిష్యతి॥ 8

* భ్వాద్యదాదీ జుహోత్యాదిర్దివాదిః స్వాదిరేవచ।
తుదాదిశ్చరుధాదిశ్చ తనక్ర్యాదిచురాదయః॥ 9
వృద్ధి క్షయ భయ జీవిత మరణం లజ్జా సత్తా స్థితి జాగరణమ్।
శయన క్రీడా రుచి దీప్త్యర్థం ధాతుగణం తమ కర్మకమాహుః॥ 10

విభక్తి ప్రత్యయములు

| | | | |
|---|---|---|---|
| సు(స్) | ఔ | జస్(అస్) | ప్రథమా |
| అమ్ | ఔట్ (ఔ) | శస్ (అస్) | ద్వితీయా |
| టా (ఆ) | భ్యామ్ | భిస్ | తృతీయా |
| ఙే (ఏ) | భ్యామ్ | భ్యస్ | చతుర్థీ |
| ఙసి (అస్) | భ్యామ్ | భ్యస్ | పంచమీ |
| ఙస్ (అస్) | ఓస్ | ఆమ్ | షష్ఠీ |
| ఙి (ఇ) | ఓస్ | సుప్ (సు) | సప్తమీ |

ఉప సర్గలు (20)

ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్ (నిర్) దుస్ (దుర్) వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప.

---

* వికరణముల నింగ్లీషు సంప్రదాయమున 1, 2, 3 ...'కాంజు కేషన్లు'గా చెప్పెదరు. అనగా 'భ్వాది'ని ఒకటవ వికరణము, అదాది రెండవ వికరణము. ఇట్లే మిగిలినవి (మొత్తము 10 వికరణములు).

శ్రీః

# అజంత పుంలింగ శబ్దములు

## 1. అకారాంతః పుంలింగో రామశబ్దః. రాముఁడు (సా.)

| ఏకవచనము | * ద్వివచనము | బహువచనము | విభక్తి |
|---|---|---|---|
| రామః | రామౌ | రామాః | ప్రథమా |
| (రాముడు) | [1] (ఇద్దరు రాములు) | (రాములు) | |
| హే రామ | హే రామౌ | హే రామాః | సంబోధన |
| (ఓ రామా) | [1] (ఓ ఇద్దరు రాములారా) | (ఓ రాములారా) | ప్రథమా |
| రామమ్ | రామౌ | రామాన్ | ద్వితీయా |
| (రాముని) | [1] (ఇద్దరు రాములను) | (బహురాములను) | |
| రామేణ | రామాభ్యామ్ | రామైః | తృతీయా |
| (రామునిచే) | [2] (ఇద్దరు రాములచే) | (రాములచే) | |
| రామాయ | రామాభ్యామ్ | రామేభ్యః | చతుర్థీ |
| (రామునికొఱకు) | [2] (ఇద్దరు రాములకొఱకు) | [3] (రాములకొఱకు) | |
| రామాత్ | రామాభ్యామ్ | రామేభ్యః | పంచమీ |
| (రామునివలన) | [2] (ఇద్దరురాములవలన) | [3] (రాములవలన) | |
| రామస్య | రామయోః | రామాణామ్ | షష్ఠీ |
| (రామునియొక్క) | [4] (,,రాములయొక్క) | (రాములయొక్క) | |
| రామే | రామయోః | రామేషు | సప్తమీ |
| (రామునియందు) | [4] (,,రాములయందు) | (రాములయందు) | |

* ద్వివచనము సంస్కృత భాషలోని యొక ప్రత్యేకత. రెండు వస్తువులను తెలుపుటకు ఈ వచనము నుపయోగింప వలయును.

1-1, 2-2, 3-3 అని వేసిన సంఖ్యలరూప సామ్యమును గుర్తింపుడు.

K 1

ఇట్లే కృష్ణః, గోవిందః, ముకుందః, శివః, ప్రథమః[1], ద్వితీయః[2] మున్నగునవి

2. అకారాంతః పుంలింగో నిర్జర శబ్దః. దేవత. (వి.)

| | | | |
|---|---|---|---|
| నిర్జరః | నిర్జరౌ, నిర్జరసౌ | నిర్జరాః, నిర్జరసః | ప్ర |
| హే నిర్జర | హే నిర్జరౌ<br>హే నిర్జరసౌ | హే నిర్జరాః<br>హే నిర్జరసః | సం |
| నిర్జరమ్, నిర్జరసమ్ | నిర్జరౌ, నిర్జరసౌ | నిర్జరాన్, నిర్జరసః | ద్వి |
| నిర్జరేణ, నిర్జరసా | నిర్జరాభ్యామ్ | నిర్జరైః | తృ |
| నిర్జరాయ, నిర్జరసే | నిర్జరాభ్యామ్ | నిర్జరేభ్యః | చ |
| నిర్జరాత్, నిర్జరసః | నిర్జరాభ్యామ్ | నిర్జరేభ్యః | పం |

---

(సా) సాధారణ శబ్దములను సూచించు గుర్తు. (వి) విశేష శబ్దములను సూచించు గుర్తు. వ్యాకరణ శాస్త్రపు సామాన్యనియమములకు లోబడినవి, విరివిగా నుపయోగింపబడునవి సాధారణ శబ్దములు. వ్యాకరణ శాస్త్రపు విశేష నియమముల వల్ల ఏర్పడి అరుదుగా వాడబడునవి విశేషశబ్దములు. ఇంతియకాక సాధారణ శబ్దములను జాగ్రత్తగా పరిశీలించినచో ప్రతివచనమునకు సాధారణముగ ఒకే రూపముండును. (మతి, ధేను, శుచి, మృదు, వంటివి తప్ప) విశేష శబ్దములో రెండు రూపము లున్నచో సాధారణముగా ఒక రూపము సాధారణ శబ్దరూపము వలెనే యుండును. రెండవ రూపమే క్రొత్తగా నచ్చుట చెప్పబడును.

గమనిక. 1. ప్రథమ శబ్దము, ప్రథమావిభక్తి, సంబోధన ప్రథమా విభక్తుల బహువచనములో మాత్రము ప్రథమే, ప్రథమాః, హే ప్రథమే, హే ప్రథమాః అని రెండేసి రూపములు.

2. ద్వితీయ శబ్దము చతుర్థీ, పంచమీ, సప్తమీ విభక్తుల ఏక వచనమున ద్వితీయస్మై, ద్వితీయాయ; ద్వితీయస్మాత్, ద్వితీయాత్, ద్వితీయస్మిన్, ద్వితీయే అని రెండేసి రూపములు.

| | | | |
|---|---|---|---|
| నిర్జరస్య, నిర్జరసః | నిర్జరయోః, నిర్జరసోః | నిర్జరాణామ్<br>నిర్జరసామ్ | ష |
| నిర్జరే, నిర్జరసి | నిర్జరయోః, నిర్జరసోః | నిర్జరేషు | స |

3. ఇకారాంతః పుంలిఙ్గో 'హరి' శబ్దః. విష్ణువు.

| | | |
|---|---|---|
| హరిః | హరీ | హరయః |
| హే హరే | హే హరీ | హే హరయః |
| హరిమ్ | హరీ | హరీన్ |
| హరిణా | హరిభ్యామ్ | హరిభిః |
| హరయే | హరిభ్యామ్ | హరిభ్యః |
| హరేః | హరిభ్యామ్ | హరిభ్యః |
| హరేః | హర్యోః | హరీణామ్ |
| హరౌ | హర్యోః | హరిషు |

ఏవం కవిః, రవిః, అగ్నిః, దాశరథిః ఇత్యాదయః.

4. ఉకారాన్తః పుంలిఙ్గః 'శమ్భు' శబ్దః. శివుడు (సా)

| | | |
|---|---|---|
| శమ్భుః | శమ్భూ | శమ్భవః |
| హే శమ్భో | హే శమ్భూ | హే శమ్భవః |
| శమ్భుమ్ | శమ్భూ | శమ్భూన్ |
| శమ్భునా | శమ్భుభ్యాం | శమ్భుభిః |
| శమ్భవే | శమ్భుభ్యాం | శమ్భుభ్యః |
| శమ్భోః | శమ్భుభ్యాం | శమ్భుభ్యః |
| శమ్భోః | శమ్భ్వోః | శమ్భూనామ్ |
| శమ్భౌ | శమ్భ్వోః | శమ్భుషు |

ఇత్థం – గురుః – విష్ణుః – భానుః – వాయుః – బాహుః – విధుః – మొ॥

5. ఋకారాన్తః పుంలిఙ్గో 'ధాతృ' శబ్దః – బ్రహ్మ (సా)

| | | |
|---|---|---|
| ధాతా | ధాతారౌ | ధాతారః |
| హే ధాతః | హే ధాతారౌ | హే ధాతారః |

| | | |
|---|---|---|
| ధాతారమ్ | ధాతారౌ | ధాతౄన్ |
| ధాత్రా | ధాతృభ్యాం | ధాతృభిః |
| ధాత్రే | ధాతృభ్యాం | ధాతృభ్యః |
| ధాతుః | ధాతృభ్యాం | ధాతృభ్యః |
| ధాతుః | ధాత్రోః | ధాతౄణామ్ |
| ధాతరి | ధాత్రోః | ధాతృషు |

ఇట్లే - నప్తా - శంస్తా - కర్తా - యన్తా - గోప్తా - మొ॥

6. ఋకారాన్తః పుంలిఙ్గః 'పితృ' శబ్దః - తండ్రి (సా)

| | | |
|---|---|---|
| పితా | పితరౌ | పితరః |
| హే పితః | హే పితరౌ | హే పితరః |
| పితరమ్ | పితరౌ | పితౄన్ |

మిగిలిన విభక్తుల రూపములు 'ధాతృ' శబ్దమువలె.

7. ఓకారాన్తః పుంలిఙ్గః 'గో' శబ్దః - ఎద్దు (సా)

| | | |
|---|---|---|
| గౌః | గావౌ | గావః |
| హే గౌః | హే గావౌ | హే గావః |
| గామ్ | గావౌ | గాః |
| గవా | గోభ్యాం | గోభిః |
| గవే | గోభ్యాం | గోభ్యః |
| గోః | గోభ్యాం | గోభ్యః |
| గోః | గవోః | గవామ్ |
| గవి | గవోః | గోషు |

ఇట్లే - సుద్యౌః - స్మృతౌః - మొ॥

## (2) అజంత స్త్రీలింగ శబ్దములు

8. ఆకారాన్తః స్త్రీలిఙ్గో 'రమా' శబ్దః - లక్ష్మి.

| | | |
|---|---|---|
| రమా | రమే | రమాః |
| హే రమే | హే రమే | హే రమాః |
| రమామ్ | రమే | రమాః |

| | | |
|---|---|---|
| రమయా | రమాభ్యాం | రమాభిః |
| రమాయై | రమాభ్యాం | రమాభ్యః |
| రమాయాః | రమాభ్యాం | రమాభ్యః |
| రమాయాః | రమయోః | రమాణామ్ |
| రమాయామ్ | రమయోః | రమాసు |

ఇట్లే - సీతా - భామా - పద్మా - ప్రజా - దుర్గా - మొ॥

గమనిక : 'అంబా' శబ్ద సంబోధన ప్రథమైకవచనము 'హే అంబ' అగును. 'ద్వితీయా' శబ్దపు, చతుర్థీ, పంచమీ, షష్ఠీ, సప్తమీ విభక్తుల ఏకవచనములలో వరుసగా - ద్వితీయస్యై, ద్వితీయాయై; ద్వితీయస్యాః, ద్వితీయాయాః; ద్వితీయస్యాః, ద్వితీయాయాః; ద్వితీయస్యాం, ద్వితీయాయాః అని రెండేసి రూపములు. ఇందు మొదటి రూపము 'సర్వా' శబ్దమును, రెండవది 'రమా' శబ్దమును పోలును.

9. ఈకారాన్తః స్త్రీలిఙ్గో 'గౌరీ' శబ్దః - పార్వతి.

| | | |
|---|---|---|
| గౌరీ | గౌర్యౌ | గౌర్యః |
| హే గౌరి | హే గౌర్యౌ | హే గౌర్యః |
| గౌరీమ్ | గౌర్యౌ | గౌరీః |
| గౌర్యా | గౌరీభ్యాం | గౌరీభిః |
| గౌర్యై | గౌరీభ్యాం | గౌరీభ్యః |
| గౌర్యాః | గౌరీభ్యాం | గౌరీభ్యః |
| గౌర్యాః | గౌర్యోః | గౌరీణామ్ |
| గౌర్యాం | గౌర్యోః | గౌరీషు |

ఇట్లే - వాణీ - నదీ - లక్ష్మీ - కర్త్రీ - మున్నగునవి. కాని 'లక్ష్మీ' ప్రథమైకవచనమున 'లక్ష్మీః' అని విసర్గలుండుట విశేషము.

10. ఉకారాన్తః స్త్రీలిఙ్గో 'ధేను' శబ్దః - ఆవు.

| | | |
|---|---|---|
| ధేనుః | ధేనూ | ధేనవః |
| హే ధేనో | హే ధేనూ | హే ధేనవః |

| | | |
|---|---|---|
| ధేనుమ్ | ధేనూ | ధేనూః |
| ధేన్వా | ధేనుభ్యాం | ధేనుభిః |
| ధేన్వై, ధేనవే | ధేనుభ్యాం | ధేనుభ్యః |
| ధేన్వాః, ధేనోః | ధేనుభ్యాం | ధేనుభ్యః |
| ధేన్వాః, ధేనోః | ధేన్వోః | ధేనూనామ్ |
| ధేన్వాం, ధేనౌ | ధేన్వోః | ధేనుషు |

ఇట్లే - తనుః - ఇషుః - పటుః - మొ॥

11. ఊకారాన్త స్త్రీలిఙ్గో 'వధూ' శబ్దః - వధువు.

| | | |
|---|---|---|
| వధూః | వధ్వౌ | వధ్వః |
| హే వధు | హే వధ్వౌ | హే వధ్వః |
| వధూమ్ | వధ్వౌ | వధూః |
| వధ్వా | వధూభ్యాం | వధూభిః |
| వధ్వై | వధూభ్యాం | వధూభ్యః |
| వధ్వాః | వధూభ్యాం | వధూభ్యః |
| వధ్వాః | వధ్వోః | వధూనామ్ |
| వధ్వామ్ | వధ్వోః | వధూషు |

ఇట్లే - తనూః - చమూః - కణ్డూః - రంభోరూః - మొ॥

12. ఈకారాన్త స్త్రీలిఙ్గః 'శ్రీ' శబ్దః - లక్ష్మి (వి)

| | | |
|---|---|---|
| శ్రీః | శ్రియౌ | శ్రియః |
| హే శ్రీః | హే శ్రియౌ | హే శ్రియః |
| శ్రియమ్ | శ్రియౌ | శ్రియః |
| శ్రియా | శ్రీభ్యామ్ | శ్రీభిః |
| శ్రియై, శ్రియే | శ్రీభ్యామ్ | శ్రీభ్యః |
| శ్రియాః, శ్రియః | శ్రీభ్యామ్ | శ్రీభ్యః |
| శ్రియాః, శ్రియః | శ్రియోః | శ్రీణామ్, శ్రియామ్ |
| శ్రియామ్, శ్రియి | శ్రియోః | శ్రీషు |

ఇట్లే - హ్రీః - భీః - ధీః - మొ॥

13. ఈకారాన్తః స్త్రీలిఙ్గః 'స్త్రీ' శబ్దః - మహిళ (వి)

| | | |
|---|---|---|
| స్త్రీ | స్త్రియౌ | స్త్రియః |
| హే స్త్రి | హే స్త్రియౌ | హే స్త్రియః |
| స్త్రియమ్, స్త్రీమ్ | స్త్రియౌ | స్త్రియః, స్త్రీః |
| స్త్రియా | స్త్రీభ్యామ్ | స్త్రీభిః |
| స్త్రియై | స్త్రీభ్యామ్ | స్త్రీభ్యః |
| స్త్రియాః | స్త్రీభ్యామ్ | స్త్రీభ్యః |
| స్త్రియాః | స్త్రియోః | స్త్రీణామ్ |
| స్త్రియామ్ | స్త్రియోః | స్త్రీషు |

## (3) అజన్త నపుంసక శబ్దములు

14. అకారాన్తః నపుంసక లిఙ్గః 'జ్ఞాన' శబ్దః - తెలివి (సా)

| | | |
|---|---|---|
| జ్ఞానమ్ | జ్ఞానే | జ్ఞానాని |
| హే జ్ఞాన | హే జ్ఞానే | హే జ్ఞానాని |
| జ్ఞానం | జ్ఞానే | జ్ఞానాని |
| జ్ఞానేన | జ్ఞానాభ్యామ్ | జ్ఞానైః |
| జ్ఞానాయ | జ్ఞానాభ్యామ్ | జ్ఞానేభ్యః |
| జ్ఞానాత్ | జ్ఞానాభ్యామ్ | జ్ఞానేభ్యః |
| జ్ఞానస్య | జ్ఞానయోః | జ్ఞానానామ్ |
| జ్ఞానే | జ్ఞానయోః | జ్ఞానేషు |

ఇట్లే - ధనం - వనం - ఫలం - లోచనం - గాంభీర్యం - మొ॥

15. ఇకారాన్త నపుంసకలిఙ్గః 'వారి' శబ్దః - నీరు (సా)

| | | |
|---|---|---|
| వారి | వారిణీ | వారీణి |
| హే వారే } హే వారి } | హేవారిణీ | హే వారీణి |
| వారి | వారిణీ | వారీణి |
| వారిణా | వారిభ్యాం | వారిభిః |

| | | |
|---|---|---|
| వారిణే | వారిభ్యాం | వారిభ్యః |
| వారిణః | వారిభ్యాం | వారిభ్యః |
| వారిణః | వారిణోః | వారిణామ్ |
| వారిణి | వారిణోః | వారిషు |

16. ఇకారాన్త నపుంసకలిఙ్గః 'శుచి' శబ్దః – పరిశుద్ధము. (సా)
ప్రథమ, ద్వితీయ. తృతీయా విభక్తులు 'వారి' వలె.

| | | | |
|---|---|---|---|
| శుచినే, శుచయే | శుచిభ్యాం | శుచిభ్యః | చతు |
| శుచినః, శుచేః | శుచిభ్యాం | శుచిభ్యః | పం |
| శుచినః, శుచేః | శుచినోః, శుచ్యోః | శుచీనామ్ | |
| శుచిని, శుచౌ | శుచినోః, శుచ్యోః | శుచిషు | |

ఇత్లే – శివతాతి – నీలరుచి – మొ॥

17. ఉకారాన్త నపుంసక లిఙ్గో 'మధు' శబ్దః – తేనె. (సా)

| | | |
|---|---|---|
| మధు | మధునీ | మధూని |
| హే మధో, హే మధు | హే మధునీ | హే మధూని |
| మధు | మధునీ | మధూని |
| మధునా | మధుభ్యాం | మధుభిః |
| మధునే | మధుభ్యాం | మధుభ్యః |
| మధునః | మధుభ్యాం | మధుభ్యః |
| మధునః | మధునోః | మధూనామ్ |
| మధుని | మధునోః | మధుషు |

ఇత్లే – అమ్బు – శ్మశ్రు – జత్రు – మొ॥

18. ఋకారాన్త నపుంసకలిఙ్గః 'కర్తృ' శబ్దః (చేయునది) (సా)

| | | |
|---|---|---|
| కర్తృ | కర్తృణీ | కర్తౄణి |
| హే కర్తః, హే కర్తృ | హే కర్తృణీ | హే కర్తౄణి |

| | | |
|---|---|---|
| కర్తృ | కర్తృణీ | కర్తౄణి |
| కర్త్రా, కర్తృణా | కర్తృభ్యాం | కర్తృభిః |
| కర్త్రే, కర్తృణే | కర్తృభ్యాం | కర్తృభ్యః |
| కర్తుః, కర్తృణః | కర్తృభ్యాం | కర్తృభ్యః |
| కర్తుః, కర్తృణః | కర్త్రోః, కర్తృణోః | కర్తౄణామ్ |
| కర్తరి, కర్తృణి | కర్త్రోః, కర్తృణోః | కర్తృషు |

ఇత్థం - హర్తృ - మొ॥

## II. (4) హలన్త పుల్లిఙ్గశబ్దాః

19. చకారాన్తః పుంలిఙ్గో 'జలముచ్'శబ్దః - మేఘము

| | | |
|---|---|---|
| జలముక్ | జలముచౌ | జలముచః |
| హే జలముక్ | హే జలముచౌ | హే జలముచః |
| జలముచమ్ | జలముచౌ | జలముచః |
| జలముచా | జలముగ్భ్యామ్ | జలముగ్భిః |
| జలముచే | జలముగ్భ్యామ్ | జలముగ్భ్యః |
| జలముచః | జలముగ్భ్యామ్ | జలముగ్భ్యః |
| జలముచః | జలముచోః | జలముచామ్ |
| జలముచి | జలముచోః | జలముక్షు |

ఇత్థం - వాక్ - సువాక్ - పయోముక్ - త్వక్ - మొ॥

20. జకారాన్తః పుంలిఙ్గః 'భిషజ్'శబ్దః - వైద్యుడు. (సా)

| | | |
|---|---|---|
| భిషక్ | భిషజౌ | భిషజః |
| హే భిషక్ | హే భిషజౌ | హే భిషజః |
| భిషజమ్ | భిషజౌ | భిషజః |
| భిషజా | భిషగ్భ్యాం | భిషగ్భిః |
| భిషజే | భిషగ్భ్యాం | భిషగ్భ్యః |
| భిషజః | భిషగ్భ్యాం | భిషగ్భ్యః |
| భిషజః | భిషజోః | భిషజామ్ |
| భిషజి | భిషజోః | భిషక్షు |

ఇత్థం - తనుత్యక్ - ఋత్విక్ - మొ॥

21. తకారాన్తః పుంలిఙ్గో 'మరు'చ్ఛబ్దః - వాయువు. (సా)

| | | |
|---|---|---|
| మరుత్ | మరుతౌ | మరుతః |
| హే మరుత్ | హే మరుతౌ | హే మరుతః |
| మరుతమ్ | మరుతౌ | మరుతః |
| మరుతా | మరుద్భ్యాం | మరుద్భిః |
| మరుతే | మరుద్భ్యాం | మరుద్భ్యః |
| మరుతః | మరుద్భ్యాం | మరుద్భ్యః |
| మరుతః | మరుతోః | మరుతామ్ |
| మరుతి | మరుతోః | మరుత్సు |

ఇట్లే - దదత్ - ఇన్ద్రజిత్ - దధత్ - సోమసుత్ - భాష్యకృత్ - హారిత్ - మొ॥

22. తకారాన్తః పుంలిఙ్గో 'పచత్' శబ్దః - వండువాడు. (సా)

| | | |
|---|---|---|
| పచన్ | పచన్తౌ | పచన్తః |
| పచన్తమ్ | పచన్తౌ | పచతః |
| * | * | * |

ఇట్లే - 'భవన్' - మొ॥

23. తకారాన్తః పుంలిఙ్గో 'ధీమత్' శబ్దః - బుద్ధిమంతుడు (సా)

| | | |
|---|---|---|
| ధీమాన్ | ధీమన్తౌ | ధీమన్తః |
| హే ధీమన్ | హే ధీమన్తౌ | హే ధీమన్తః |
| ధీమన్తమ్ | ధీమన్తౌ | ధీమతః |
| * | * | * |

ఇట్లే - గుణవాన్ - భవాన్ - మొ॥

గమనిక:- పై 'పచత్' 'ధీమత్' 'దివిషద్' శబ్దముల తృతీయనుండి, సప్తమి వరకు గల విభక్తులు 'మరుత్తు' వలె ఉండును.

24. దకారాన్తః పుంలిఙ్గో "దివిషద్" శబ్దః దేవత. (సా)

| | | |
|---|---|---|
| దివిషత్ | దివిషదౌ | దివిషదః |
| హే దివిషత్ | హే దివిషదౌ | హే దివిషదః |
| దివిషదం | దివిషదౌ | దివిషదః (23 చూ) |

25. నకారాన్తః పుంలిఙ్గో "రాజన్" శబ్దః. రాజు. (సా)

| | | |
|---|---|---|
| రాజా | రాజానౌ | రాజానః |
| హే రాజన్ | హే రాజానౌ | హే రాజానః |
| రాజానం | రాజానౌ | రాజ్ఞః |
| రాజ్ఞా | రాజభ్యాం | రాజభిః |
| రాజ్ఞే | రాజభ్యాం | రాజభ్యః |
| రాజ్ఞః | రాజభ్యాం | రాజభ్యః |
| రాజ్ఞః | రాజ్ఞోః | రాజ్ఞామ్ |
| రాజ్ఞి, రాజని | రాజ్ఞోః | రాజసు |

ఇట్లే - సుత్రామా - వృషా - మహిమా - యజ్వా - మొ॥

26. నకారాన్తః పుంలింగః 'ఆత్మన్' శబ్దః ఆత్మ. (సా)

| | | |
|---|---|---|
| ఆత్మా | ఆత్మానౌ | ఆత్మానః |
| హే ఆత్మన్ | హే ఆత్మానౌ | హే ఆత్మానః |
| ఆత్మానమ్ | ఆత్మానౌ | ఆత్మనః |
| ఆత్మనా | ఆత్మభ్యాం | ఆత్మభిః |
| ఆత్మనే | ఆత్మభ్యాం | ఆత్మభ్యః |
| ఆత్మనః | ఆత్మభ్యాం | ఆత్మభ్యః |
| ఆత్మనః | ఆత్మనోః | ఆత్మనామ్ |
| ఆత్మని | ఆత్మనోః | ఆత్మసు |

ఇట్లే - బ్రహ్మా - పాప్మా - యజ్వా - మొ॥

27. నకారాన్తః పుల్లింగో "గుణిన్" శబ్దః. గుణవంతుడు. (సా)

| | | |
|---|---|---|
| గుణీ | గుణినౌ | గుణినః |
| హేగుణిన్ | హేగుణినౌ | హేగుణినః |

| | | |
|---|---|---|
| గుణినమ్ | గుణినౌ | గుణినః |
| గుణినా | గుణిభ్యామ్ | గుణిభిః |
| గుణినే | గుణిభ్యామ్ | గుణిభ్యః |
| గుణినః | గుణిభ్యామ్ | గుణిభ్యః |
| గుణినః | గుణినోః | గుణినామ్ |
| గుణిని | గుణినోః | గుణిషు |

ఇట్లే - సారథీ - శశీ - కేసరీ - జయీ - మొ॥

28. సకారాన్తః పుంలిఙ్గో "వేధ" శ్శబ్దః - బ్రహ్మ. (సా)

| | | |
|---|---|---|
| వేధాః | వేధసౌ | వేధసః |
| హే వేధః | హే వేధసౌ | హే వేధసః |
| వేధసం | వేధసౌ | వేధసః |
| వేధసా | వేధోభ్యామ్ | వేధోభిః |
| వేధసే | వేధోభ్యాం | వేధోభ్యః |
| వేధసః | వేధోభ్యాం | వేధోభ్యః |
| వేధసః | వేధసోః | వేధసామ్ |
| వేధసి | వేధసోః | వేధస్సు. |

ఇట్లే - చన్ద్రమస్ - ప్రచేతస్ - పురోధస్ - మొ॥

29. సకారాన్తః పుంలిఙ్గః శ్రేయశ్శబ్దః. శ్రేష్ఠుఁడు (సా)

| | | |
|---|---|---|
| శ్రేయాన్ | శ్రేయాంసౌ | శ్రేయాంసః |
| హే శ్రేయః | హే శ్రేయాంసౌ | హే శ్రేయాంసః |
| శ్రేయాంసమ్ | శ్రేయాంసౌ | శ్రేయసః |

మిగిలినది వేధశ్శబ్దము వలె.

ఇట్లే - ప్రేయాన్ - గరీయాన్ - మొ॥

30. సకారాన్తః పుంలిఙ్గో "విద్వ"చ్ఛబ్దః - విద్వాంసుడు. (సా)

| | | |
|---|---|---|
| విద్వాన్ | విద్వాంసౌ | విద్వాంసః |
| హే విద్వన్ | హే విద్వాంసౌ | హే విద్వాంసః |

| | | |
|---|---|---|
| విద్వాంసమ్ | విద్వాంసౌ | విదుషః |
| విదుషా | విద్వద్భ్యాం | విద్వద్భిః |
| విదుషే | విద్వద్భ్యాం | విద్వద్భ్యః |
| విదుషః | విద్వద్భ్యాం | విద్వద్భ్యః |
| విదుషః | విదుషోః | విదుషామ్ |
| విదుషి | విదుషోః | విద్వత్సు |

ఇట్లే - సేదివాన్ - ఉపేయివాన్ - తస్థివాన్ - మొ॥

## (5) హలంత స్త్రీలింగ శబ్దములు

31. ధకారాన్తః స్త్రీలింగః క్షుచ్ఛబ్దః. ఆకలి (వి)

| | | |
|---|---|---|
| క్షుత్ | క్షుధౌ | క్షుధః |
| క్షుధమ్ | క్షుధౌ | క్షుధః |
| క్షుధా | క్షుద్భ్యామ్ | క్షుద్భిః |
| క్షుధే | క్షుద్భ్యామ్ | క్షుద్భ్యః |
| క్షుధః | క్షుద్భ్యామ్ | క్షుద్భ్యః |
| క్షుధః | క్షుధోః | క్షుధామ్ |
| క్షుధి | క్షుధోః | క్షుత్సు. |

ఇట్లే - యుత్ - మర్మవిత్ - మొ॥

32. పకారాన్తః స్త్రీలింగః 'అప్' శబ్దః.

ఆపః, అపః, అద్భిః, అద్భ్యః, అద్భ్యః, అపామ్, అప్సు.

(ఇది నిత్యబహువచనాంతము. దీనికి ఏక, ద్వివచనరూపము లుండవు.)

33. రేఫాన్తః స్త్రీలిఙ్గో గిర్శబ్దః. వాక్కు (సా)

| | | |
|---|---|---|
| గీః | గిరౌ | గిరః |
| గిరమ్ | గిరౌ | గిరః |
| గిరా | గీర్భ్యామ్ | గీర్భిః |

| | | |
|---|---|---|
| గిరే | గీర్భ్యామ్ | గీర్భ్యః |
| గిరః | గీర్భ్యామ్ | గీర్భ్యః |
| గిరః | గిరోః | గిరామ్ |
| గిరి | గిరోః | గీర్షు |

ఇట్లే - పూః - ధూః - మొ॥

34. వకారాన్తః స్త్రీలిఙ్గో 'దివ్' శబ్దః. స్వర్గము (వి) (సా)

| | | |
|---|---|---|
| ద్యౌః | దివౌ | దివః |
| దివమ్ | దివౌ | దివః |
| దివా | ద్యుభ్యామ్ | ద్యుభిః |
| దివే | ద్యుభ్యామ్ | ద్యుభ్యః |
| దివః | ద్యుభ్యామ్ | ద్యుభ్యః |
| దివః | దివోః | దివామ్ |
| దివి | దివోః | ద్యుషు. |

35. శకారాన్తః స్త్రీలిఙ్గో 'దిక్' శబ్దః. దిక్కు. (సా)

| | | |
|---|---|---|
| దిక్ | దిశౌ | దిశః |
| దిశం | దిశౌ | దిశః |
| దిశా | దిగ్భ్యాం | దిగ్భిః |
| దిశే | దిగ్భ్యాం | దిగ్భ్యః |
| దిశః | దిగ్భ్యాం | దిగ్భ్యః |
| దిశః | దిశోః | దిశామ్ |
| దిశి | దిశోః | దిక్షు. |

## (6) హలంత నపుంసకలింగ శబ్దములు

37. తకారాన్త నపుంసకలిఙ్గః 'జగత్' శబ్దః. లోకము (సా)

| | | |
|---|---|---|
| జగత్ | జగతీ | జగన్తి |
| జగత్ | జగతీ | జగన్తి |

* * *

38. తకారాన్త నపుంసకలింగః పచచ్ఛబ్దః (సా)

| | | |
|---|---|---|
| పచత్ | పచతీ | పచన్తి |
| పచత్ | పచతీ | పచన్తి |

* * *

37, 38. శబ్దములు తృతీయనుండి మరుచ్ఛబ్దమువలె.

39. తకారాన్త నపుంసకలింగః 'మహత్' శబ్దః. గొప్పది (సా)

| | | |
|---|---|---|
| మహత్ | మహతీ | మహాన్తి |
| మహత్ | మహతీ | మహాన్తి |

* * *

40. దకారాన్త నపుంసకలిఙ్గో హృచ్ఛబ్దః. మనస్సు (సా)

| | | |
|---|---|---|
| హృత్ | హృదీ | హృన్ది |
| హృత్ | హృదీ | హృన్ది |

* * *

39, 40. తృతీయనుండి దివిషచ్ఛబ్దము వలె.

41. నకారాన్త నపుంసకలిఙ్గో నామన్ శబ్దః. పేరు (సా)

| | | |
|---|---|---|
| నామ | నామ్నీ, నామనీ | నామాని |
| హే నామన్ / హే నామ | హే నామ్నీ / హే నామనీ | హే నామాని |
| నామ | నామ్నీ, నామనీ | నామాని |

* * *

తృతీయనుండి రాజన్ శబ్దము వలె. 11 పేజి

ఇట్లే - దామ - సురాజ - మొ॥

42. నకారాన్త నపుంసకలిఙ్గః కర్మన్ శబ్దః. పని (సా)

| | | |
|---|---|---|
| కర్మ | కర్మణీ | కర్మాణి |
| హే కర్మన్ / హే కర్మ | హే కర్మణీ | హే కర్మాణి |
| కర్మ | కర్మణీ | కర్మాణి |

తృతీయనుండి ఆత్మన్ శబ్దము వలె.

ఇట్లే - వర్మ - మర్మ - మొ॥

43. నకారాన్త నపుంసలిఙ్గః "అహన్" శబ్దః (దినము) (సా)

| | | |
|---|---|---|
| అహః | అహ్నీ, అహనీ | అహాని |
| అహః | అహ్నీ, అహనీ | అహాని |
| అహ్నా | అహోభ్యాం | అహోభిః |
| అహ్నే | అహోభ్యాః | అహోభ్యః |
| అహ్నః | అహోభ్యాం | అహోభ్యః |
| అహ్నః | అహ్నోః | అహ్నామ్ |
| అహ్ని, అహని | అహ్నోః | అహస్సు |

44. సకారాన్త నపుంసకలిఙ్గః "మన" శ్శబ్దః—మనస్సు. (సా)

| | | |
|---|---|---|
| మనః | మనసీ | మనాంసి |
| హే మనః | హే మవసీ | హే మనాంసి |
| మనః | మనసీ | మనాంసి |
| మనసా | మనోభ్యామ్ | మనోభిః |
| మనసే | మనోభ్యామ్ | మనోభ్యః |
| మనసః | మనోభ్యామ్ | మనోభ్యః |
| మనసః | మనసోః | మనసామ్ |
| మనసి | మనసోః | మనస్సు |

ఇట్లే - వచస్ - పయస్ - వయస్ - మొదలగునవి.

## III. సర్వనామ శబ్దములు

45. అకారాన్తః పుంలిఙ్గః "సర్వ" శబ్దః. ప్రతివ్యక్తి.

| | | |
|---|---|---|
| సర్వః | సర్వౌ | సర్వే |
| హే సర్వ | హే సర్వౌ | హే సర్వే |
| సర్వం | సర్వౌ | సర్వాన్ |
| సర్వేణ | సర్వాభ్యాం | సర్వైః |

| | | |
|---|---|---|
| సర్వస్మై | సర్వాభ్యాం | సర్వేభ్యః |
| సర్వస్మాత్ | సర్వాభ్యాం | సర్వేభ్యః |
| సర్వస్య | సర్వయోః | సర్వేషాం |
| సర్వస్మిన్ | సర్వయోః | సర్వేషు |

46. ఆకారాన్తః స్త్రీలిఙ్గః "సర్వా" శబ్దః ప్రతిస్త్రీ.

| | | |
|---|---|---|
| సర్వా | సర్వే | సర్వాః |
| హే సర్వే | హే సర్వే | హే సర్వాః |
| సర్వామ్ | సర్వే | సర్వాః |
| సర్వయా | సర్వాభ్యామ్ | సర్వాభిః |
| సర్వస్యై | సర్వాభ్యామ్ | సర్వాభ్యః |
| సర్వస్యాః | సర్వాభ్యామ్ | సర్వాభ్యః |
| సర్వస్యాః | సర్వయోః | సర్వాసామ్ |
| సర్వస్యామ్ | సర్వయోః | సర్వాసు |

47. ఆకారాన్త నపుంసకలిఙ్గః "సర్వ" శబ్దః ప్రతిది.

| | | |
|---|---|---|
| సర్వమ్ | సర్వే | సర్వాణి |
| హే సర్వ | హే సర్వే | హే సర్వాణి |
| సర్వమ్ | సర్వే | సర్వాణి |

మిగిలిన రూపములు పుంలిఙ్గ 'సర్వ' శబ్దమువలె.

48. దకారాన్తః పుంలిఙ్గః 'తత్' శబ్దః—వాడు.

| | | |
|---|---|---|
| సః | తౌ | తే |
| తమ్ | తౌ | తాన్ |
| తేన | తాభ్యాం | తైః |
| తస్మై | తాభ్యాం | తేభ్యః |
| తస్మాత్ | తాభ్యాం | తేభ్యః |
| తస్య | తయోః | తేషామ్ |
| తస్మిన్ | తయోః | తేషు |

49. దకారాన్తః స్త్రీలిఙ్గ ‘స్త.’చ్ఛబ్దః—ఆమె.

| | | |
|---|---|---|
| సా | తే | తాః |
| తామ్ | తే | తాః |
| తయా | తాభ్యామ్ | తాభిః |
| తస్యై | తాభ్యామ్ | తాభ్యః |
| తస్యాః | తాభ్యామ్ | తాభ్యః |
| తస్యాః | తయోః | తాసామ్ |
| తస్యామ్ | తయోః | తాసు |

50. తకారాన్త నపుంసకలిఙ్గః “తత్” శబ్దః—అది.

| | | |
|---|---|---|
| తత్ | తే | తాని |
| తత్ | తే | తాని—— |

మిగిలినవి పుంలింగ ‘తత్’ శబ్ద రూపములవలె.

51. దకారాన్తః పుంలిఙ్గో ‘య’చ్ఛబ్దః—ఎవడు.

| | | |
|---|---|---|
| యః | యౌ | యే |
| యం | యౌ | యాన్ |
| యేన | యాభ్యాం | యైః |
| యస్మై | యాభ్యాం | యేభ్యః |
| యస్మాత్ | యాభ్యాం | యేభ్యః |
| యస్య | యయోః | యేషాం |
| యస్మిన్ | యయోః | యేషు |

52. దకారాన్తః స్త్రీలింగో ‘యద్’ శబ్దః—ఎవతె

| | | |
|---|---|---|
| యా | యే | యాః |
| యాం | యే | యాః |
| యయా | యాభ్యాం | యాభిః |
| యస్యై | యాభ్యాం | యాభ్యః |
| యస్యాః | యాభ్యాం | యాభ్యః |

| | | |
|---|---|---|
| యస్యాః | యయోః | యాసామ్ |
| యస్యామ్ | యయోః | యాసు |

53. దకారాన్త నపుంసకలిఙ్గో 'య'చ్ఛబ్దః. ఏది.

| | | |
|---|---|---|
| యత్ | యే | యాని |
| యత్ | యే | యాని |

మిగిలినవి పుంలింగ యచ్ఛబ్దమువలె.

54. దకారాన్తః పుంలిఙ్గః 'అస్మత్' శబ్దః – నేను.

| | | |
|---|---|---|
| అహమ్ | ఆవామ్ | వయమ్ |
| మామ్, మా | ఆవామ్, నౌ | అస్మాన్, నః |
| మయా | ఆవాభ్యామ్ | అస్మాభిః |
| మహ్యమ్, మే | ఆవాభ్యామ్, నౌ | అస్మభ్యమ్, నః |
| మత్ | ఆవాభ్యామ్ | అస్మత్ |
| మమ, మే | ఆవయోః, నౌ | అస్మాకమ్, నః |
| మయి | ఆవయోః | అస్మాసు |

55. దకారాన్తః పుంలిఙ్గః 'యుష్మత్' శబ్దః – నీవు.

| | | |
|---|---|---|
| త్వమ్ | యువామ్ | యూయమ్ |
| త్వామ్, త్వా | యువామ్, వామ్ | యుష్మాన్, వః |
| త్వయా | యువాభ్యామ్ | యుష్మాభిః |
| తుభ్యమ్, తే | యువాభ్యామ్, వామ్ | యుష్మభ్యమ్, వః |
| త్వత్ | యువాభ్యామ్ | యుష్మత్ |
| తవ, తే | యువయోః, వామ్ | యుష్మాకమ్, వః |
| త్వయి | యువయోః | యుష్మాసు |

యుష్మద్, అస్మద్ శబ్దములకు లింగభేదము లేదు.

56. దకారాన్తః పుంలిఙ్గః 'ఏతత్' శబ్దః వీడు.

| | | |
|---|---|---|
| ఏషః | ఏతౌ | ఏతే |
| ఏతం, ఏనం | ఏతౌ, ఏనౌ | ఏతాన్, ఏనాన్ |

| | | |
|---|---|---|
| ఏతేన, ఏనేన | ఏతాభ్యాం | ఏతైః |
| ఏతస్మై | ఏతాభ్యాం | ఏతేభ్యః |
| ఏతస్మాత్ | ఏతాభ్యాం | ఏతేభ్యః |
| ఏతస్య | ఏతయోః, ఏనయోః | ఏతేషామ్ |
| ఏతస్మిన్ | ఏతయోః, ఏనయోః | ఏతేషు |

57. దకారాన్త స్త్రీలిఙ్గః 'ఏత'చ్ఛబ్దః – ఈమె.

| | | |
|---|---|---|
| ఏషా | ఏతే | ఏతాః |
| ఏతాం, ఏనాం | ఏతే, ఏనే | ఏతాః, ఏనాః |
| ఏతయా, ఏనయా | ఏతాభ్యాం | ఏతాభిః |
| ఏతస్యై | ఏతాభ్యాం | ఏతాభ్యః |
| ఏతస్యాః | ఏతాభ్యాం | ఏతాభ్యః |
| ఏతస్యాః | ఏతయోః, ఏనయోః | ఏతాసాం |
| ఏతస్యాం | ఏతయోః, ఏనయోః | ఏతాసు |

58. దకారాన్త నపుంసక లిఙ్గః 'ఏతద్' శబ్దః – ఇది.

| | | |
|---|---|---|
| ఏతత్ | ఏతే | ఏతాని |
| ఏతత్, ఏనత్ | ఏతే, ఏనే | ఏతాని, ఏనాని |

మిగిలినవి పుంలిఙ్గము వలె.

59. మకారాన్తః పుంలిఙ్గః 'కిమ్' శబ్దః – ఎవడు.

| | | |
|---|---|---|
| కః | కౌ | కే |
| కమ్ | కౌ | కాన్ |
| కేన | కాభ్యామ్ | కైః |

మిగిలినవి పుంలిఙ్గ తచ్ఛబ్దము వలె (48)

60. మకారాన్త స్త్రీలింగః 'కిమ్' శబ్దః – ఎవతె.

| | | |
|---|---|---|
| కా | కే | కాః |
| కాం | కే | కాః |

మిగిలినవి స్త్రీలిఙ్గ తచ్ఛబ్దము వలె (49)

61. మకారాన్త నపుంసక లిఙ్గః 'కిమ్' శబ్దః - ఏది.

| | | |
|---|---|---|
| కిమ్ | కే | కాని |
| కిమ్ | కే | కాని |

మిగిలినది 'తత్' శబ్దము వలె (48)

62. మకారాన్తః పుంలిఙ్గః 'ఇదమ్' శబ్దః - ఇతడు.

| | | |
|---|---|---|
| అయం | ఇమౌ | ఇమే |
| ఇమం. ఏనం | ఇమౌ, ఏనౌ | ఇమాన్, ఏనాన్ |
| అనేన, ఏనేన | ఆభ్యామ్ | ఏభిః |
| అస్మై | ఆభ్యామ్ | ఏభ్యః |
| అస్మాత్ | ఆభ్యామ్ | ఏభ్యః |
| అస్య | అనయోః, ఏనయోః | ఏషామ్ |
| అస్మిన్ | అనయోః, ఏనయోః | ఏషు |

63. మకారాన్తః స్త్రీలిఙ్గః 'ఇదం' శబ్దః - ఈమె.

| | | |
|---|---|---|
| ఇయం | ఇమే | ఇమాః |
| ఇమాం, ఏనాం | ఇమే, ఏనే | ఇమాః, ఏనాః |
| అనయా, ఏనయా | ఆభ్యాం | ఆభిః |
| అస్యై | ఆభ్యాం | ఆభ్యః |
| అస్యాః | ఆభ్యాం | ఆభ్యః |
| అస్యాః | అనయోః, ఏనయోః | ఆసాం |
| అస్యాం | అనయోః, ఏనయోః | ఆసు |

64. మకారాన్త నపుంసక లిఙ్గః 'ఇదమ్' శబ్దః - ఇది.

| | | |
|---|---|---|
| ఇదమ్ | ఇమే | ఇమాని |
| ఇదమ్, ఏనత్ | ఇమే, ఏనే | ఇమాని ఏనాని |

మిగిలిన రూపములు 62 వలె.

65. సకారాన్తః పుంలిఙ్గః 'అదస్' శబ్దః – వీడు.

| | | |
|---|---|---|
| అసౌ | అమూ | అమీ |
| అముమ్ | అమూ | అమూన్ |
| అమునా | అమూభ్యాం | అమీభిః |
| అముష్మై | అమూభ్యాం | అమీభ్యః |
| అముష్మాత్ | అమూభ్యాం | అమీభ్యః |
| అముష్య | అముయోః | అమీషామ్ |
| అముష్మిన్ | అముయోః | అమీషు |

66. సకారాన్త స్త్రీలిఙ్గః 'అద'శ్శబ్దం – ఈమె.

| | | |
|---|---|---|
| అసౌ | అమూ | అమూః |
| అమూమ్ | అమూ | అమూః |
| అముయా | అమూభ్యామ్ | అమూభిః |
| అముష్యై | అమూభ్యామ్ | అమూభ్యః |
| అముష్యాః | అమూభ్యామ్ | అమూభ్యః |
| అముష్యాః | అముయోః | అమూషామ్ |
| అముష్యాం | అముయోః | అమూషు |

67. సకారాన్త నపుంసక లింగః 'అద'శ్శబ్దః – ఇది.

| | | |
|---|---|---|
| అదః | అమూ | అమూని |
| అదః | అమూ | అమూని |

మిగిలిన రూపములు 65 వలె.

## III. సంధి స్వరూపములు

1. అ ఇ ఉ ణ్, 2. ఋ ఌ క్, 3. ఏ ఓ ఙ్, 4. ఐ ఔ చ్, 5. హయవరట్, 6. లణ్, 7. ఞమఙణనమ్, 8. ఝభఞ్, 9. ఘఢధష్, 10. జబగడదశ్, 11. ఖఫఛఠథచటతవ్, 12. కపయ్, 13. శషసర్, 14. హల్.

పై పదునాలుగును "మాహేశ్వర సూత్రము"లను పేర ప్రసిద్ధములు. వీనినుండి 'అణ్' 'అక్' అను "ప్రత్యాహారములు" సిద్ధించును.

భిన్న పదోచ్చారణమున మొదటిపదపు చివరి వర్ణమునకు, రెండవ పదపు మొదటి వర్ణమునకును అర్ధమాత్రా కాలమే వ్యవధానముగా గలుగు సాన్నిధ్యమునకు 'సంధి'యనియు, 'సంహిత'యనియు పేరు. సం + ధా— ధాతువునకు 'కి' ప్రత్యయాంత రూపము 'సంధి'యనియు, 'క్త' ప్రత్యయాంత రూపము 'సంహిత'యనియు నగును.

ఈ సంధులు ప్రధానముగా నాలుగు విధములు, అవి—

1. "అచ్ సంధి" 2. "హల్ సంధి" 3. "విసర్గ సంధి" 4. "స్వాది సంధి".

1. అచ్ సంధి :—అచ్ వర్ణమునకు మరల అచ్ వర్ణమే పరమైనపుడీ సంధి గలుగును. దీనికే 'స్వరసన్ధి'యనియు పేరు. అచ్చులకు 'స్వరము'లనియు పేరు గలదు.

2. హల్ సంధి :—హల్ వర్ణమునకు, తిరిగి హల్ వర్ణము పరమైనపుడీ సంధి గలుగును. ఒకచో హల్ వర్ణమునకు అచ్ వర్ణము పరమైనను, అచ్ వర్ణమునకు హల్ వర్ణము పరమైనను 'హల్ సంధి' గలుగును.

3. విసర్గ సంధి :—ఒక పదము చివటి విసర్గకు హల్ వర్ణముగాని, అచ్ వర్ణముగాని పరమైనచో నీ సంధి గలుగును.

4. స్వాది సంధి :—'సుప్' ప్రత్యయమునకు హల్లు పరమగునపుడీ సంధి కలుగును.

అచ్ సంధి ఎనిమిది విధములుగ నగును. 1. సవర్ణదీర్ఘ 2. గుణ 3. వృద్ధి 4. యణాదేశ 5. అయవాయావాదేశ 6. పూర్వరూప 7. పరరూప 8. ప్రకృతిభావ మనియెడివిగా నగును.

1. సవర్ణదీర్ఘసంధి :—అ, ఇ, ఉ, ఋ, ఌ అను వర్ణములకు సవర్ణమగు నచ్చు పరమగునపుడు దీర్ఘవర్ణము (అచ్చులు) లాదేశములగును.

ఉదా :—1. దైత్య + అరిః = దైత్యారిః, 2. విష్ణు + ఉదయః = విష్ణూదయః.

2. గుణసంధి :—అ, ఆ అను వర్ణములకంటె నచ్చు (ఇ-ఉ-ఋ-ౠ) పరమగునపుడు (అర్-ఏ-ఓ) గుణవర్ణము లాదేశములగును.

ఉదా.—1. ఉప + ఇన్ద్రః = ఉపేన్ద్రః, 2. రమా + ఈశః = రమేశః, 3. గఙ్గా + ఉదకమ్ = గఙ్గోదకమ్.

3. వృద్ధిసంధి —అ, ఆ అను వర్ణములకంటె ఏ, ఓ, ఐ, ఔలు పరమగునపుడు ఐ, ఔ, ఆర్ అను వర్ణము లాదేశమగును.

ఉదా.—1. కృష్ణ + ఏకత్వమ్ = కృష్ణైకత్వమ్, 2. గఙ్గా + ఓఘః గఙ్గౌఘః.

4. యణాదేశసంధి :—సంధి వివక్షితమైనపుడు అచ్చులకు నవ్యవహితముగ పూర్వమునకుండు ఇక్కుల (ఇ-ఉ-ఋ-ౠ) స్థానమున యణ్ణులు (య-వ-ర-ల) ఆదేశములగును.

ఉదా —సుధీ + ఉపాస్యః = సుధ్యుపాస్యః, 2. గమిష్యామి + అపహాస్యతామ్ = గమిష్యామ్యపహాస్యతామ్.

5. అయవాద్యాదేశసంధి :—ఏ, ఓ, ఐ, ఔ లకు అచ్చు పరమగుచో క్రమముగ అయ్, అవ్, ఆయ్, ఆవ్‌లు వచ్చును.

ఉదా :—1. హరే + ఏ = హరయ్ + ఏ = హరయే, 2. విష్ణో + ఏ = విష్ణవ్ + ఏ = విష్ణవే, 3. నై + అకః = నాయ్ + అకః = నాయకః, 4. పౌ + అకః = పావ్ + అకః = పావకః.

6. పూర్వరూపసంధి —పదాన్తమునందున్న ఏ, ఓ అను వర్ణములకు 'అ' యను వర్ణము పరమగునపుడు పూర్వరూపమాదేశమగును.

ఉదా.—1. హరే + అవ = హరేఽవ, 2. విష్ణో + అవ = విష్ణోఽవ.

7. పరరూపసంధి :—'అ'యను వర్ణము చివరగల యుపసర్గకంటె ఏకారముగాని, ఓకారముగాని మొదటగల ధాతువు పరమైనపుడు పరరూప మేకాదేశమగును.

ఉదా.—ప్ర + ఏజతే = ప్రేజతే.

మఱియును అవర్ణముకంటె 'ఓమ్ - ఆ' యను వర్ణములు పరమగునపుడును పరరూపము వచ్చును. 'ఓమాఙోశ్చ' (6_1_95)

ఉదా —1. శివాయ + ఓమ్ నమః = శివాయోం నమః, 2. శివ + ఏహి = శివేహి.

8. ప్రకృతిభావసంధి :—ప్లుత ప్రగృహ్యసంజ్ఞక వర్ణముల కచ్చు పరమగునపుడు ప్రకృతి భావము (ఉన్నదున్నట్లుండుట) గలుగును.

* త్రిమాత్రాకాలమున (ఊ 3 అను వర్ణము నుచ్చరించుటకు పట్టునంత సమయమున) నుచ్చరింపబడు నచ్చునకు ప్లుతమని పేరు.

* ఈ - ఊ - ఏ అను వర్ణము లంతమందుగల ద్వివచనములకు ప్రగృహ్యము లని పేరు.

ఉదా —1. ఏహికృష్ణ3 + అత్ర గౌశ్చరతి = ఏహికృష్ణ3 అత్ర గౌశ్చరతి. ఇట సవర్ణదీర్ఘమున కపవాదము.

2. హరీ + ఏతౌ = హరీ ఏతౌ. ఇట యణాదేశమున కపవాదము.

,, పదాన్తములగు 'అ, ఇ, ఉ, ఋ, ౠ' వర్ణములకు హ్రస్వమగు 'ఋ' పరమగునపుడు వికల్పముగ ప్రకృతి భావము గలుగును.

ఉదా —1. బ్రహ్మ + ఋషిః = బ్రహ్మ ఋషిః - బ్రహ్మర్షిః,
2. సప్త + ఋషీణామ్=సప్తఋషీణామ్_సప్తర్షీణామ్.

## (2) హల్సంధి

ఇయ్యది బహువిధములుగా నుండును. అందు సామాన్యముగ ప్రసిద్ధమైన సంధులు పదునొకండు.

1. శ్చుత్వసంధి, 2. ష్టుత్వసంధి, 3. ఙముడాగమసంధి, 4. అనునాసికసంధి, 5. అనుస్వారసంధి, 6. జశ్త్వసంధి, 7. ఛత్వసంధి, 8. చర్త్వసంధి, 9. లకారాదేశసంధి, 10. పదాన్తసకారరేఫాదేశసంధి, 11. తుగాగమసంధి.

1. శ్చుత్వసంధి :—'స'కారమునకు, తవర్గము (త, థ, ద, ధ, న)

నకు 'శ' కారముతోగాని, చవర్గముతోగాని (చ, ఛ, జ, ఝ, ఞ) సంయోగము గలిగిన - క్రమముగ శవర్ణము, చవర్గము (చ, ఛ, జ, ఝ, ఞ) నాదేశముగా వచ్చును.

ఉదా :—1. హరిస్ + శేతే = హరిశ్శేతే

2. రామస్ + చినోతి = రామశ్చినోతి.

2. ష్టుత్వసంధి :—'స' కారమునకు, తవర్గము (త, థ, ద, ధ, న) నకు 'ష' కారముతోగాని, టవర్గముతోగాని (ట, ఠ, డ, ఢ, ణ) సంయోగము గలిగిన క్రమముగ 'ష' కారము - టవర్గము (ట, ఠ, డ, ఢ, ణ) ఆదేశముగా వచ్చును.

ఉదా :—1. రామస్ + షష్ఠః = రామష్షష్ఠః

2. చక్రిన్ + ఢౌకసే = చక్రిణ్ఢౌకసే.

3. ఙముడాగమసంధి :—హ్రస్వముకంటె పరమగు ఙమ్ (ఙ, ణ, న) వర్ణము చివరగల పదముకంటె పరమైన యచ్చునకు ఙముడాగమము నిత్యముగ వచ్చును.

ఉదా :—ప్రత్యఙ్ + ఆత్మా = ప్రత్యఙ్ఙాత్మా

2. వినేష్యన్ + ఇవ = వినేష్యన్నివ.

4. అనునాసికసంధి —పదాన్తమునందలి 'యర్' (య, వ, ర, ల, ఞ, మ, ఙ, ణ, న, ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప. శ, ష, స) వర్ణములకు అనునాసిక వర్ణములు (ఞ, మ, ఙ, ణ, న) పరమగునపుడు అనునాసికము వికల్పముగ నగును.

ఉదా :—1. ఏతద్ + మురారిః = ఏతన్మురారిః

2. ఆసీత్ + మహీక్షితామ్ = ఆసీన్మహీక్షితామ్.

5. అనుస్వారసంధి :—'మ' కారము చివరగల పదమునకు హల్లు పరమగునపు డనుస్వార మాదేశమగును.

ఉదా :—1. హరిమ్ + వన్దే = హరిం వన్దే.

పదాన్తములుగాని, నకార మకారములకు ఝల్ (ఝ, భ, ఘ, ఢ,

ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప, శ, ష, స, హ) వర్ణములు పరమగునపు డనుస్వారమాదేశమగును.

ఉదా:—1. యశాన్స్ + ఇ = యశాంసి

2. ఆక్రమ్ + స్యతే = ఆక్రంస్యతే.

6. జశ్త్వసంధి.—పదాన్తమందలి ఝల్ (ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప, శ, ష, స) వర్ణములకు జశ్ (జ, బ, గ, డ, ద) వర్ణములాదేశములగును.

ఉదా:—1. వాక్ + ఈశః = వాగీశః

2. దిక్ + అన్తరమ్ = దిగన్తరమ్.

7. ఛత్వసన్ధిః:—'ఝయ్' పరమగు 'శ'కారమునకు 'అమ్' పరమగునపుడు ఛకారము వికల్పముగ నగును.

1. తద్ + శివః = తచ్ఛివః  2. తచ్ + శ్లోకః = తచ్ఛ్లోకః.

8. చర్త్వసన్ధిః:—'ఝల్లు'ల స్థానమున 'ఖర్' పరము కాగా 'చర్'లు వచ్చును.

1. తచ్ + శివః = తచ్ఛివః  2. తచ్ + శ్లోకః = తచ్ఛ్లోకః
3. వాక్ + పతిః = వాక్పతిః  4. తత్ + సరః = తత్సరః.

9. లకారాదేశసంధి:—'త'వర్గకు లకారము పరమైనచో పరసవర్ణము వచ్చును.

ఉదా —1. తద్ + లయః = తల్లయః

2. విద్వాన్ + లిఖతి = విద్వాల్లిఖతి.

సన్ + శంభుః = సన్ + త్ + శమ్భుః (తుక్ వచ్చుచో)

సన్ + చ్ + ఛమ్భుః (ఛత్వము)

సఞ్ + చ్ + ఛమ్భుః (శ్చుత్వము)

సఞ్ + చ్ + ఛమ్భుః

అజంతమునకు ఛకారము పరమగుచో నిత్యముగ తుగాగమము (త్) వచ్చును. ఆఙ్, మాఙ్ కాని పదాంత దీర్ఘమునకు ఛకారము పరమగుచో వికల్పముగ (త్) వచ్చును.

1. రామ + ఛత్రమ్ = రామచ్ఛత్రమ్.

2. లక్ష్మీ + ఛాయా = లక్ష్మీచ్ఛాయా, లక్ష్మీఛాయా.

నకారాంత పదమునకు శకారము పరమైనను వికల్పముగ తుగాగమము వచ్చును. పక్షాంతరమున చత్వము. ఛత్వము, అనుస్వారము పరసవర్ణత వచ్చును.

ఉదా :—సన్ + శివః = 1. సఞ్ ఛివః 2. సఞ్ చ్ ఛివః
3. సఞ్ చ్ శివః 4. సఞ్ శివః.

## విసర్గసంధి

3. విసర్గసంధి:—విసర్గమునకు 'శర్' (శ, ష, స) వర్ణములు పరమగునపుడు విసర్గము వికల్పముగా వచ్చును.

ఉదా:—1. హరిః + శేతే = హరిశ్శేతే - హరిః శేతే.

విసర్గమునకు 'క' 'ఖ' అను వర్ణములు పరమగునపుడు 'జిహ్వామూలీయము,' 'ప' 'ఫ' అను వర్ణములు పరమగునపుడు 'ఉపధ్మానీయ' మాదేశమగును.

1. ఉదా —కః + కరోతి = కꣳకరోతి.

2. నౄన్ + పాహి = నౄꣳపాహి. నలాంꣳపాహి.

## స్వాదిసంధి

స్వాదిసంధి:—నఞ్ సమాసముగానిచోట, కకార రహితములగు ఏతత్-తత్ శబ్దముల (ప్రథమా విభక్త్యేకవచనమగు 'సుప్' ప్రత్యయము) హల్లు పరమగునపుడు లోపించును.

ఉదా:—1. ఏషః + విష్ణుః = ఏష విష్ణుః
2. సః + శమ్భుః = స శమ్భుః
3. సః + కీచకైః = స కీచకైః

ఇంతవరకు అతిముఖ్యములగు కొన్ని సంధు లివ్వబడినవి. ప్రస్తుతము ఇంకను గమనింపదగిన మఱికొన్ని సంధు లిచట సూచింపబడుచున్నవి.

I. అచ్ సంధిః—1. 'శకన్ధ్వాదిగణ' పఠితములగు పదములందలి 'టి' సంజ్ఞకల వర్ణమునకు పరరూపము వచ్చును.

(1) శక + అన్ధుః = శకన్ధుః (2) మనస్ + ఈషా = మనీషా.

2. అవర్ణముకంటె 'ఓ' కారముగాని, 'ఆఙ్' గాని, అనవధారణార్థకమగు 'ఏవ' కారముగాని, పరముకాగా 'పరరూప'ము వచ్చును.

(1) శివాయ + ఓంనమః = శివాయోంనమః. (2) శివ + ఆ + ఇహి = శివేహి. (3) క్వ + ఏవభోక్ష్యసే = క్వేవభోక్ష్యసే.

3. 'అవఙాదేశసంధి'.—పదాన్తమునందలి 'గో' శబ్దమునకు 'అత్' పరము కాగా 'అవఙాదేశము' నిత్యముగానగును. 'ఇన్ద్రి' పరముకాగా వికల్పముగానగును.

(1) గో + అగ్రమ్ = గోఅగ్రమ్, గోఽగ్రమ్. (2) గో + ఈశః = గవేశః, గవీశః (3) గో + ఇన్ద్రః = గవేంద్రః.

4. 'స్వాదిసంధి':—1. హ్రస్వమగు అకారముకంటె పరమగు పదాన్త సకారమునకు హ్రస్వాకారము 'హశ్' వర్ణము పరమగునపుడు 'ఉ' అనునది ఆదేశమగును.

(1) మనస్ + రథః = మనోరథః. (2) అవర్ణముకంటె పరమగు తదన్త నకారమునకు 'అశ్' వర్ణము పరముకాగా యాదేశము వచ్చును.

అవర్ణముకంటె పరమగు పదాన్త 'య'కార 'వ'కారములకు 'అశ్' వర్ణము పరముకాగా వికల్పముగ లోపము కల్గును.

(1) దేవాః + ఇహ = దేవాయ్ + ఇహ = దేవా ఇహ.

(2) దేవాః + నమ్యాః = దేవాయ్ + నమ్యాః = దేవా నమ్యాః.

3. 'రే'ఫమునకు 'ఢ'కారమునకు క్రమముగ రేఫము ఢకారము పరముకాగా లోపము కల్గును. అట్లే రేఫ ఢకారలోప నిమిత్తములగు రేఫఢకారములకు ముందుండు 'అణ్'నకు దీర్ఘము వచ్చును.

(1) పునః + రమతే = పునా రమతే.

4. ప్రకృతిభావసంధి.–పదాన్తములగు 'ఇక్' వర్ణమునకు అసవర్ణమగు అచ్చు పరమైనపుడు అట్లే యుండును. వికల్పముగ హ్రస్వములగును. సమాసమునందు హ్రస్వములు కావు.

(1) చక్రీ + అత్ర = చక్రి, అత్ర - చక్రీఅత్ర - చక్ర్యత్ర.

(2) వాపీ + అశ్వః = వాప్యశ్వః.

హల్సంధి:– 1. 'పరసవర్ణసంధి' – అపదాన్తమగు అనుస్వారమునకు 'యయ్' వర్ణములు పరముకాగా పరసవర్ణము నిత్యముగానగును. పదాన్తమగు అనుస్వారమునకు వికల్పముగ నగును. 'త' వర్గమునకు 'ల' కారము పరముకాగా నిత్యముగ నగును.

(1) అఙ్కితః, (2) అఞ్చితః, (3) కుణ్ఠితః, (4) శాన్తః, (5) త్వంకరోషి, (6) త్వఙ్కరోషి, (7) త్వంచతురః, (8) త్వఞ్చతురః, (9) తంధర్మమ్, (10) తన్ధర్మమ్, (11) సంయన్తా, సయ్యన్తా, (12) సంవత్సరః, సవ్వత్సరః, (13) యంలోకమ్, యల్లోకమ్, (14) తత్ + లయః, తల్లయః, (15) విద్వాన్ + లిఖతు = విద్వాల్లిఖతు.

2. 'పూర్వవర్ణసంధిః' –'ఝయ్' పరమగు హకారమునకు పూర్వసవర్ణము వికల్పముగానగును. 'ఉత్' అను ఉపసర్గకంటె పరమగు 'స్థా' 'స్తమ్భ' ధాతువులకు పూర్వవర్ణము నిత్యమగును.

(1) వాక్ + హరిః (2) షట్ + హయాః = షడ్ఢయాః, తత్ + హితమ్ = తద్ధితమ్.

## ధాతువులు (Roots)

క్రియలను తెలుపు 'భూ', 'దివ్' మొదలగునవి ధాతువులు. సంస్కృత భాషలో రెండు వేలకు పైబడిన ధాతువులున్నవి. అన్ని ధాతువులకు కర్తయుండును. కర్మ మాత్రము కొన్ని ధాతువులకుండదు. కర్మ కల ధాతువులకు సకర్మకములు (Transitive). కర్మ లేనివి అకర్మకములు (Intransitive). సకర్మక ధాతువులకు కర్త్రర్థము,

కర్మార్థములందును, అకర్మకములకు కర్త్రర్థము, భావార్థములందును [1] లట్ మున్నగు ప్రత్యయములు వచ్చును. ఈ లడాదులు లేక 'లకారములు' పది విధములు. ఇందులో 6 కాలము తెలుపునవి (Tenses). 4 ప్రకారము తెలుపునవి (Moods). ఇవికాక వేదమున మాత్రమే ప్రయోగింపబడు 'లేట్' అను లకారమును కలదు.

## కాలవాచకములు (Tenses)

| క్ర. సం. | లకారము | కాలము | ఇంగ్లీషు | ఉదాహరణము |
|---|---|---|---|---|
| 1. | లట్ | వర్తమాన కాలము | Present | పిబతి = త్రాగుచున్నాడు |
| 2. | లఙ్ | అనద్యతన భూతకాలము | Past Imperfect | అపిబత్ = త్రాగెను |
| 3. | లుఙ్ | భూతకాలము | Past Aorist | అపాత్ = త్రాగెను |
| 4. | లిట్ | పరోక్ష భూతకాలము | Past Perfect | పపౌ = త్రాగెను |
| 5. | లుట్ | అనద్యతన భవిష్యత్కాలము | First Future | పాతా = త్రాగగలడు |
| 6. | ల్పట్ | భవిష్యత్కాలము | Second Future | పాస్యతి = త్రాగగలడు |

## ప్రకారవాచకములు (Moods)

| | | | | |
|---|---|---|---|---|
| 1. | లోట్ | ఆజ్ఞ | Imperative | పిబతు = త్రాగుగాక |
| 2. | విధిలిఙ్ | విధి | Potential | పిబేత్ = త్రాగవలెను |

1. 'లడ్వర్తమానే లేడ్వేదే భూతే లుఙ్ లఙ్ లిట స్తథా ।
విధ్యాశిషో స్తు లిఙ్ లోటౌ ల్పఙ్ ల్పట్ లుట్ చ భవిష్యతి' ॥

3. ఆశీర్లిఙ్   ఆశీస్సు   Benedictive పేయాత్ = త్రాగును గాక

4. ఌఙ్   క్రియాతిపత్తి Conditional అపాస్యత్ = త్రాగియుండెడివాడు

వీనిలో ప్రతి లకారస్థానమునను పురుషప్రత్యయములు (Personal Terminations) [2]ఆదేశముగ వచ్చును. పురుషలు మూడు విధములు: 1. ప్రథమ పురుష (Third Person). 2. మధ్యమ పురుష (Second Person). 3. ఉత్తమ పురుష (First Person). ప్రతి పురుషకు మూడు వచనములు కలవు.

| | | | |
|---|---|---|---|
| 1. | ఏకవచనము | Singular | ఒకదానిని బోధించును. |
| 2. | ద్వివచనము | Dual | రెంటిని బోధించును. |
| 3. | బహువచనము | Plural | రెండికంటె మించినవానిని బోధించును. |

పురుషప్రత్యయములకే 'తిఙ్'లు అని పేరు. తిఙ్లకు 'పరస్మైపదము', 'ఆత్మనేపద'మని రెండు పదములున్నవి. కొన్ని ధాతువులకు పరస్మైపదము మాత్ర ముండును. వీనినే 'పరస్మైపదులు' అందుము. కొన్నింటికి ఆత్మనేపదము మాత్ర ముండును. వీనిని 'ఆత్మనేపదులు' అందుము. కొన్నింటి కీ రెండు పదములుండును. వీనిని 'ఉభయపదులు' అందుము.

లకారములు 'సార్వధాతుకములు' (Conjugatianal Tenses and Moods) అనియు, 'ఆర్ధధాతుకములు' (Non-Conjugationol Tenses and Moods) అనియు రెండు విధములు. (అ) లట్, లఙ్, లోట్, విధిలిఙ్ అను నీ నాల్గును సార్వధాతుకములు. మిగిలిన యారును ఆర్ధధాతుకములు. ఇందు సార్వ

2. 'ఆదేశము'లు వేనికి విధింపబడునో వానిని త్రోసిపుచ్చి ఆ స్థానమున వచ్చును. ('శత్రువత్ ఆదేశః' = ఆదేశము శత్రువువలె వచ్చును).

ధాతుకలకారములు పరమైనపుడు ధాతువు - ప్రత్యయముల నడుమ వికరణములు (Conjugations) అను పేరు గల ప్రత్యయములు చేర్చ బడును. కావున 'పిబతి' మున్నగువానిలో 'మూడు' అంశము లున్నవి. పిబ్ (పా) - అ (శప్) - తి (తిప్). ఇందు పిబ్ (పా) అనునది ధాతువు. అ (శప్) అనునది వికరణ ప్రత్యయము. తి (తిప్) అనునది లకార స్థానమున ఆదేశముగ వచ్చిన పురుషప్రత్యయము.

వికరణ ప్రత్యయములు పది విధములు. వాని భేదమునుబట్టి ధాతువులు పది గణములుగ విభజింపబడినవి. (34వ పేజీ చూడుము)

## (ఆ) ఆర్ధధాతుక లకారములు

## (Non-conjugational Tenses and Moods)

| | | | |
|---|---|---|---|
| 1. లుట్ | First Future | 4. ఆశీర్లిజ్ | Benedictive |
| 2. ల్పృట్ | Second Future | 5. లిట్ | Perfect |
| 3. ల్పృజ్ | Conditional | 6. లిజ్ | Aorist |

పై ఆరును ఆర్ధధాతుక లకారములు. వీనికి వికరణ భేదము లేదు. ఏ ధాతువుకైనను వికరణ ప్రత్యయ వ్యవధానము లేకుండ పై లకారముల పురుష ప్రత్యయములు (తిజ్జులు) చేర్చిన వీని రూపములు సిద్ధించును.

## 'ఇట్' ఆగమము

ఆర్ధధాతుకములలో 'ఇట్' ఆగమము వచ్చుట విశేషము. కొన్ని ధాతువులపైనుండు ప్రత్యయములకు 'ఇట్' అను [1]ఆగమము ఆద్యవయవముగ వచ్చును. ఏ ధాతువుల కిడాగమము వచ్చునో అవి (i) 'సేట్టులు' అనబడును. ఇడాగమము రాని ధాతువులు (ii) 'అనిట్టులు'. కొన్ని ధాతువులకు ఇడాగమము వికల్పముగ వచ్చును. అవి (iii) 'వేట్టులు'

---

1. ఆగమములు వేనికి విధింపబడునో వానికి ముందు లేక వెనుక వచ్చును. ('మిత్రవత్ ఆగమః' = మిత్రునివలె ఆగమము చేరును.)

| క్ర. సం. | Conjugation | గణము పేరు | ధాతువు | వికరణ ప్రత్యయము | ప్రత్యయము పరస్మై | ప్రత్యయము ఆత్మనే | రూపము పరస్మైపద | రూపము ఆత్మనేపద |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | First | భ్వాది | భూ | అ | తి | | భవతి | |
| | | | లభ్ | అ | | తే | | లభతే |
| 2. | Second | అదాది | అద్ | — | తి | | అత్తి | |
| | | | సూ | — | | తే | | సూతే |
| 3. | Third | జుహోత్యాది | హు | — | తి | | జుహోతి | |
| | | | మా | — | | తే | | మిమీతే |
| 4. | Fourth | దివాది | దివ్ | య | తి | | దీవ్యతి | |
| | | | యుధ్ | య | | తే | | యుధ్యతే |
| 5. | Fifth | స్వాది | సు | ను | తి | | సునోతి | |
| | | | వృ | ను | | తే | | వృణుతే |
| 6. | Sixth | తుదాది | తుద్ | అ | తి | | తుదతి | |
| | | | లజ్జ్ | అ | | తే | | లజ్జతే |
| 7. | Seventh | రుధాది | రుధ్ | న | తి | | రుణద్ధి | |
| | | | విద్ | న | | తే | | విన్త్తే |
| 8. | Eighth | తనాది | తన్ | ఉ | తి | | తనోతి | |
| | | | మన్ | ఉ | | తే | | మనుతే |
| 9. | Nineth | క్ర్యాది | క్రీ | నా | తి | | క్రీణాతి | |
| | | | వృ | నా | | తే | | వృణీతే |
| 10. | Tenth | చురాది | చుర్ | (ఇ+అ) = అయ | తి | | చోరయతి | |
| | | | భూష్ | అయ | | తే | | భూషయతే |

| | | |
|---|---|---|
| 77. దర్భమూల | దర్భమూలీ | ,, |
| 78. గోవాల | గోవాలీ | ,, |
| 79. దాక్షి | దాక్షీ | దక్షుని కూతురు |
| 80. ఔదమేయి | ఔదమేయీ | ఉదమేయుని కూతురు |

6. ఙీన్ (ఈ) ప్రత్యయాంతములు

| | | |
|---|---|---|
| 1. శార్ఙ్గరవ | శార్ఙ్గరవీ | శార్ఙ్గరవుని కూతురు |
| 2. బైద | బైదీ | బైదుని కూతురు |
| 3. నృ | నారీ | స్త్రీ |

7. ఊఙ్ (ఊ) ప్రత్యయాంతములు

| | | |
|---|---|---|
| 1. భద్రబాహు | భద్రబాహూః | మంచి భుజములు కలది |
| 2. వృత్తబాహు | వృత్తబాహూః | గుండ్రని భుజములు కలది |
| 3. పంగు | పంగూః | కుంటిది |
| 4. శ్వశుర | శ్వశ్రూః | అత్త |
| 5. కరభోరు | కరభోరూః | కరభము వంటి తొడలు కలది |
| 6. సంహితోరు | సంహితోరూః | కలసియున్న తొడలు కలది |
| 7. శఫోరు | శఫోరూః | ,, |
| 8. లక్షణోరు | లక్షణోరూః | సలక్షణమైన తొడలు కలది |
| 9. వామోరు | వామోరూః | సుందరమైన ,, |
| 10. సహితోరు | సహితోరూః | అతిశయించిన తొడలు కలది |
| 11. కద్రు | కద్రూః | నాగమాత, కద్రువ |
| 12. కమండలు | కమండలూః | ఒక పాత్ర |

## కారక ప్రకరణము

కారక మనగా క్రియతో నన్వయించునది. ఇది వాక్యమున క్రియతో తక్కిన పదములకు గల సంబంధము తెలియజేయును. ఈ కారక మారు విధములు. షష్ఠీ ప్రత్యయాంతమునకు సాక్షాత్ క్రియాన్వయ

ముండదు కాన నది కారకము కాదు. ఆ యా కారకములకు వచ్చు విభక్తు లీ క్రిందఁ జూపబడినవి.

1. కర్తృకారకము — ప్రథమా విభక్తి
2. కర్మకారకము — ద్వితీయా విభక్తి
3. కరణ కారకము — తృతీయ విభక్తి
4. సంప్రదాన కారకము — చతుర్థీ విభక్తి
5. అపాదాన కారకము — పంచమీ విభక్తి
5. — — షష్ఠీ విభక్తి
7. అధికరణ కారకము — సప్తమీ విభక్తి

2. కర్తృకారకము - ప్రథమా విభక్తి:

కారకము, మనము చెప్పదలచుట (వివక్ష) ననుసరించి యుండును. (వివక్షాతః కారకాణి భవంతి). క్రియలో స్వతంత్రుఁడుగా వివక్షితుడు 'కర్త' యగును. (స్వతంత్రః కర్తా). ఆ కర్తను ప్రేరణ చేయువాడును 'కర్త' యగును. (తత్ప్రయోజకో హేతుశ్చ). కర్త యగు కారకము కర్తృ కారకము.

ఈ క్రింది యైదు సందర్భములలో 'కర్త' కు ప్రథమా విభక్తి వచ్చును. 'ప్రాతిపదికార్థ లింగ పరిమాణ వచన మాత్రే ప్రథమా', 'సంబోధనే చ'.)

(1) ప్రాతిపదికార్థమున — ఈ శబ్దమున కిది యర్థమను నిశ్చితప్రతీతి కల యర్థము ప్రాతిపదికార్థము. లింగమే లేని యవ్యయములు, నియత (మారని) లింగము కల పదము లిందుల కుదాహరణములు.

1. ఉచ్చైః స్థితిః జగతి ధర్మతః సిధ్యతి (అవ్యయము)
2. నీచైః గతిః మూర్ఖాణాం భవతి ( ,, )
3. కృష్ణః కంసం అహన్ (నియత పుంలింగము)
4. శ్రీః సంపదః దదాతి ( ,, స్త్రీ ,, )
5. జ్ఞానం తత్త్వం దిశతి ( ,, నపుంసక ,, )

(2) లింగమాత్రాధిక్యమున — స్థిరముగ నొకే లింగము లేని శబ్దము లందు నుదాహరణము.

తటః (పుం) తటీ (స్త్రీ) తటమ్ (నపుంసక) సమ్యక్ అస్తి.

స్థలః (పుం) స్థలీ (స్త్రీ) స్థలమ్ (నపుంసక) సుష్ఠు అస్తి.

(3) పరిమాణ మాత్రమున: పరిమాణ మనగా కొలపాత్ర. దానితో కొలువబడిన వస్తువు తత్పరిమిత మగును.

ఉదా ద్రోణః వ్రీహిః అత్రవర్తతే. ఇచట ద్రోణః అను పదమున కు 'ద్రోణ' మను కొలపాత్రతో కొలువబడిన ధాన్యము అర్థము.

(4) వచన మాత్రమున. వచన మనగా సంఖ్య.

1. ఏకః బాలకః గృహం గచ్ఛతి.

2. ద్వౌ వృషభౌ శకటం వహతః.

3. బహవః జనాః ధనం వాంఛంతి.

(5) సంబోధనమున. సంబోధన మనగా పిలుచుట.

హే రామ! శయనాత్ ఉత్తిష్ఠ.

కర్త - ప్రేరణ కర్త.

i. రామః గ్రామం గచ్ఛతి (రాముడు గ్రామము పోవుచున్నాడు) రామః - కర్త.

ii. రామః కృష్ణం గ్రామం గమయతి (రాముడు కృష్ణుని గ్రామమునకు పంపుచున్నాడు) రామః - ప్రేరణ కర్త.

2. కర్మ కారకము - ద్వితీయా విభక్తి.

(తిఙ్, కృత్, తద్ధిత, సమాస, నిపాతలచే తెలుపబడనిచో) కర్మకు ద్వితీయ వచ్చును. (కర్మణి ద్వితీయా) కర్మ యనగా—

(1) కర్త క్రియ ద్వారా దేనిని పొందుటకు మిగుల నిష్టపడునో యది కర్మ.

ఉదా కృష్ణః పాఠశాలాం గచ్ఛతి: ఇచట కర్త యగు కృష్ణునకు

గమన క్రియ ద్వారా పొందుటకు మిగుల నిష్టమైనది పారశాల కాన నది కర్మ. కనుక దానికి ద్వితీయ వచ్చినది.

(2) కర్తకు పొంద నిష్టమైన దానివలె, క్రియతో కూడినదై కర్తకు యిష్టము కానిదియు కర్మ యగును.

ఉదా: గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి. కర్తకు గమన క్రియ ద్వారా పొందుట కిష్టమైనది గ్రామము కాన నది కర్మ. స్పర్శన క్రియా యుక్తమై కర్త కీప్సితము గాకున్నను 'తృణము' గూడ కర్మ యగును. ఇట్లే 'ఓదనం భుంజానో విషం భుంక్తే' యనుచో గూడ కర్తకు 'భుజ' క్రియ ద్వారా ఓదనము ఈప్సితమై కర్మ యగును. అనీప్సితమయ్యు భుజి క్రియా యుక్తము గాన విషమును కర్మ యగును. కాన రెండు స్థలములలో ద్వితీయ ప్రవర్తించినది.

(3) అపాదానము, సంప్రదానము, అధికరణము, కర్మ, కరణము, కర్త. హేతువను వీనిచే వివక్షితము (చెప్పదలంచబడినది) కాని కారకము (అకథిత) కర్మ యగును. ఈ క్రింది పదునారు ధాతువుల కర్మతో గూడినదే అకథిత కర్మ యగును.

| ధాతువు | ఉదాహరణము | ప్రధాన కర్మ | అకథిత కర్మ |
|---|---|---|---|
| 1. దుహ్ | గాం దోగ్ధి పయః | పయః | గాం |
| 2. యాచ్ | బలిం యాచతే వసుధామ్ | వసుధామ్ | బలిం |
| | అవినీతం వినయం యాచతే | వినయం | అవినీతం |
| 3. పచ్ | తండులాన్ ఓదనం పచతి | ఓదనం | తండులాన్ |
| 4. దండ్ | గర్గాన్ శతం దండయతి | శతం | గర్గాన్ |
| 5. రుధ్ | వ్రజం అవరుణద్ధి గామ్ | గామ్ | వ్రజం |
| 6. ప్రచ్ఛ | మాణవకం పంథానం పృచ్ఛతి | పంథానం | మాణవకం |
| 7. చి | వృక్షం అవచినోతి ఫలాని | ఫలాని | వృక్షం |
| 8. బ్రూ | మాణవకం ధర్మం బ్రూతే | ధర్మం | మాణవకం |
| 9. శాస్ | ,, ,, శాస్తి | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| 10. జి | శతం జయతి దేవదత్తమ్ | శతం | దేవదత్తమ్ |
| 11. మన్థ్ | సుధాం క్షీరనిధిం మథ్నాతి | సుధాం | క్షీరనిధిం |
| 12. ముష్ | దేవదత్తం శతం ముష్ణాతి | శతం | దేవదత్తం |
| 13. నీ | గ్రామం అజాం నయతి | అజాం | గ్రామం |
| 14. కృష్ | ,, ,, కర్షతి | ,, | ,, |
| 15. వహ్ | ,, ,, వహతి | ,, | ,, |
| 16. హృ | ,, ,, హరతి | ,, | ,, |

ఇవియే గాక నీ యర్థముల నిచ్చు మరియే ధాతువులు ప్రయుక్తము లైనను ప్రధాన, అకథిత కర్మల నిటులనే యూహించునది.

(4) అకర్మక ధాతువులతో సంబంధ మున్నపుడు 1. దేశము, 2. కాలము, 3. భావము, 4. పోవలసిన మార్గము 'కర్మ' లనబడును.

1. దేవదత్తః కురూన్ స్వపితి.
(దేవదత్తుఁడు కురుదేశమున నిద్రించుచున్నాడు.)
2. దేవదత్తః మాసం ఆస్తే (దేవదత్తుఁడు నెల యున్నాడు.)
3. దేవదత్తః గోదోహం ఆస్తే.
(దేవదత్తుఁడు పాలు పితుకు వఱకున్నాడు.)
4. దేవదత్తః క్రోశం ఆస్తే.
(దేవదత్తుఁడు ఒక క్రోసు దూరమున నున్నాడు.)

(5) గమనము, జ్ఞానము, భక్షణము అర్థముగా కలవై, శబ్దము కర్మగా కలవై అకర్మకము లగు కేవల ధాతువులచే వాచ్యమగు క్రియ కేది కర్త యగునో యది ఆ 'ణ్యంత' ధాతువులచే వాచ్యమగు క్రియకు కర్మ యగును. ఉదా:

1. శత్రవః స్వర్గం అగచ్ఛన్ (కేవలధాతువు - శత్రవః - కర్త)
శ్రీహరిః శత్రూన్ స్వర్గం అగమయత్ (ణ్యంతధాతువు - శత్రూన్ - కర్మ)
2. స్వే వేదార్థం అవిదుః (కేవల ధా. స్వే - కర్త)
శ్రీహరిః స్వాన్ వేదార్థం అవేదయత్ (ణ్యా. ధా. స్వాన్-కర్మ)

3. దేవా అమృతం ఆశ్నన్ (కే. ధా. దేవాః - కర్త)
శ్రీహరిః దేవాన్ అమృతం ఆశయత్ (ణ్య. ధా. దేవాన్ - కర్మ)
4. విధిః వేదం అధ్యైత (కే. ధా. విధిః - కర్త)
శ్రీహరిః విధిం వేదం అధ్యాపయత్ (ణ్య. ధా. విధిం - కర్మ)
5. పృధ్వీ సలిలే ఆస్త (కే. ధా. పృధ్వీ - కర్త)
శ్రీహరిః పృధ్వీం సలిలే ఆసయత్ (ణ్య. ధా. పృధ్వీం - కర్మ)

(7) ణ్యంతములు కాని హృ, కృ ధాతువుల కేది కర్తయో అది వికల్పముగా కర్మ యగును. ఉదా

1. హరతి కటం భృత్యః హారయతి కటం భృత్యం/భృత్యేన వా.
2. కరోతి " " కారయతి " "

(8) అధి అను ఉపసర్గ పూర్వమందు కల శీఙ్, స్థా, ఆస్ ధాతువులు వస్తుతః అకర్మకములు. కాన వీని యాధారమే 'కర్మ' యగును.

ఉదా. హరిః వైకుంఠం అధిశేతే/అధితిష్ఠతి/అధ్యాస్తే. ఇచ్చట వైకుంఠము యీ క్రియలు మూటికి ఆధారము. కాన నది కర్మ.

(9) అభి ని అను నీ రెండుపసర్గల సమూహము పూర్వమందు గల 'విశ్' ధాతువునకు గూడ నాధార మగునది కర్మ యగును.

ఉదా అభినివిశతే సన్మార్గమ్. (సన్మార్గమందు పట్టుదల కలిగి యున్నాడు.) ఇచట అభినివేశమున కాధారము సన్మార్గము కాన నది కర్మ.

(10) ఉప, అను, అధి, ఆఙ్ అను ఉపసర్గలతో కూడిన వస్ ధాతువునకు ఆధారము కర్మ యగును.

ఉదా· ఉపవసతి/అనువసతి/అధివసతి/ఆవసతి వా వైకుంఠం హరిః. ఇచట నాధారమగు వైకుంఠము కర్మ యైనది.

(11) దివ్ ధాతువాచ్య క్రియాసిద్ధిలో మిక్కిలి యుపకరించు కారకము 'కర్మ'యు కరణము నగును.

ఉదా అక్షాన్/అక్షైః వా దీవ్యతి. జూదములో మిగుల నుపకరించునవి పాచికలు (అక్షములు) కాన నవి వికల్పముగ 'కర్మ' లైనవి.

ఈ పై పదునొకండు సందర్భములలోను కర్మలకు ద్వితీయా విభక్తి వచ్చుట గమనింపదగినది. ఇటుపైన ఉపపదము (సమీపమున నున్న పదము) నాధారము చేసికొని వచ్చు ద్వితీయ వివరింపబడును.

1. అంతరా, అంతరేణ అను వానితో సంబంధము కల పదమునకు ద్వితీయ వచ్చును.

ఉదా అంతరా త్వాం/మాం హరిః. అంతరేణ హరిం న సుఖమ్.

2. కాలము, మార్గము వీనితో మిక్కిలి యెడతెగని సంబంధమున్న పదమునకు ద్వితీయ వచ్చును.

ఉదా: మాసం కల్యాణీ. (నెల రోజు లవిచ్ఛిన్నముగ శుభము లందువాడు) మాసం అధీతే. (నెల రోజు లవిచ్ఛిన్నముగ చదువుచున్నాడు) క్రోశం కుటిలా నదీ (క్రోసు దూరము వఱకు నది వంకరగా ప్రవహించుచున్నది. క్రోశం గిరిః (క్రోసు దూరము వఱకు) కొండ యున్నది.

3. 'కర్మ ప్రవచనీయము'లతో సంబంధము కల పదమునకు ద్వితీయ వచ్చును. కర్మ ప్రవచనీయము లనగా—

(i) లక్షణము సూచింపబడుచో 'అను' అనునది కర్మ ప్రవచనీయ మగును.

ఉదా: పర్జన్యః జపం అను ప్రావర్షత్. ఇచట హేతువగు జపముచే వర్షము లక్షితమైనది. (వర్షము కొఱకు జపము చేసిరి. జపము పూర్తి యగుట తోడనే వాన కురిసెను. కాన జపనుచే వర్షముపలక్షితమైనది.)

(ii) తృతీయార్థమున గూడ 'అను' అనునది కర్మప్రవచనీయ మగును.

ఉదా: నదీం అను అవసితా సేనా. (సేన నదితో సంబంధించియున్నది.)

(iii) 'హీనత' (తక్కువ యగుట) సూచింపబడుచో 'అను' అనునది కర్మ ప్రవచనీయ మగును.

ఉదా. అను హరిం సురాః (దేవతలు హరికంటె తక్కువ వారు.)

(iv) 'హీనత' సూచింపఁబడుచో 'ఉప' యనునది కర్మ ప్రవచనీయ మగును.

ఉదా: ఉప హరిం సురాః.

(v) లక్షణము. యిట్లయినదని చెప్పుట. భాగము (స్వీకరించ దగిన యంశము), వీప్స (అంతటను వ్యాపించుట) యను నర్థములందు ప్రతి, పరి, అనునవి కర్మ ప్రవచనీయము లగును. ఉదా:

(vi) 1. లక్షణము : వృక్షం ప్రతి/పరి/అను వా విద్యోతతే విద్యుత్. (వృక్షము వైపు మెఱుపు మెఱయుచున్నది.)

2. ఇట్లాయెననుట భక్తః విష్ణుం ప్రతి/పరి/అను వా. (విష్ణు విషయక మగు భక్తి కలవాడు.)

3. భాగము లక్ష్మీః హరిం/ప్రతి/పరి అను వా. (లక్ష్మి హరి యొక్క సొత్తు.)

4. వీప్స: వృక్షం వృక్షం ప్రతి విద్యోతతే విద్యుత్. (మెఱుపు ప్రతి చెట్టు వద్దను మెఱయుచున్నది. (వీప్స యున్నపుడు రెండుసార్లు పదము చెప్పబడును.)

(vii) 1. లక్షణము, 2. ఇట్లాయెననుట, 2. వీప్సలు సూచింపబడుచో 'అభి' కర్మ ప్రవచనీయ మగును.

ఉదా. 1. హరిం అభి వర్తతే. 2. భక్తో హరిం అభి, 3. దేవం దేవం అభి సించతి.

(viii) అతిక్రమించుట. పూజించుట యను నర్థమున 'అతి' యనునది కర్మ ప్రవచనీయ మగును.

ఉదా: అతి దేవాన్ కృష్ణః.

(ix) 1. సంభావనము (అత్యుక్తి), 2. కామచారానుజ్ఞ. 3. గర్హా 4. సముచ్చయమను నర్థములు సూచింపబడినపుడు 'అపి' కర్మ ప్రవచనీయ మగును.

ఉదా: 1. అపి స్తుయా ద్విష్ణుమ్. (విష్ణుని గూడస్తోత్రము చేయును)

2. అపి స్తుహి రామమ్ (రాముని స్తోత్రము చేసిన చేయుము లేక మానుము.)

3. ధిగ్దేవదత్తమ్ అపి స్తుయాత్ చోరమ్ (చోరుని పొగడు చున్న దేవదత్తునకు నింద యగుగాక!)

3. కరణకారకము – తృతీయా విభక్తి:

ముఖ్యముగ ఈ క్రింది సందర్భములలో తృతీయ వచ్చుట గమనింప దగినది.

(1) సహ (కలసి) యను నర్ధముతో కూడినపుడు అప్రధానమునకు తృతీయ వచ్చును.

ఉదా పుత్రేణ సహ ఆగతః పితా. తండ్రి కుమారునితో గలసి వచ్చెను. ఇట తండ్రి ప్రధానుడు. కుమారు డప్రధానుడు కాన నాత నికి తృతీయ వచ్చినది.

(2) ఏ వికృతాంగముచే అంగి యొక్క వికారము తెలియునో దానికిని తృతీయ వచ్చును.

ఉదా· అక్ష్ణా కాణః (కంటికి సంబంధించిన గ్రుడ్డితనమను వికార ముతోఁ గూడినవాడు.)

(3) లక్షణముచే నిట్టివాడని తెలుపుచో నా లక్షణమునకు తృతీయ వచ్చును.

ఉదా. జటాభిః తాపసః. (జడలచే తాపసుఁడు)

(4) హేత్వర్థమున తృతీయ వచ్చును.

ఉదా. దండేన ఘటః. కఱ్ఱ యను హేతువుచే సిద్ధమైనది కుండ. (కుమ్మరి కుండ చేయుటలో కఱ్ఱ హేతువు). పుణ్యేన దృష్టో హరిః (హరి పుణ్యముచే చూడబడెను) హరిని జూచుటలో పుణ్యము హేతువు.

(5) కర్త కర్మ అభిహితము గానిచో తృతీయ వచ్చును.

రామేణ (కర్త) బాణేన (కరణము) హతో వాలీ.

(రామునిచే బాణముచే వాలి చంపబడెను). ఇచట కర్త రాముఁడు కరణము బాణము. వీనికి తృతీయ వచ్చినది.

4. సంప్రదాన కారకము - చతుర్థీ విభక్తి.

ప్రధానముగ ఈ క్రింది సందర్భములలో చతుర్థీ విభక్తి వచ్చును.

(1) సంప్రదానమున చతుర్థి వచ్చును. సంప్రదాన మనగా—

(i) దానక్రియ ద్వారా కర్త యెవని సంబంధము నిష్టపడునో నది సంప్రదానము.

ఉదా విప్రాయ గాం దదాతి. ఇచట కర్త దానక్రియ ద్వారా గోవును విప్రునితో సంబంధింపజేయ నిచ్ఛగించుచున్నాడు కాన విప్రుడు సంప్రదానము.

(ii) రుచ్యర్థకములగు ధాతువులు ప్రయోగించునపు డిష్టము కల వాడు సంప్రదాన మగును.

ఉదా: హరయే రోచతే భక్తిః. (హరికి భక్తి యిష్టమగుచున్నది. బాలకాయ కథా రోచతే (బాలునకు కథ యిష్టము)

(iii) స్పృహ ధాతువును ప్రయోగించినపు డిష్టమగు వస్తువు సంప్రదాన మగును.

ఉదా: పుష్పేభ్యః స్పృహయతి.

(iv) క్రుధ్, ద్రుహ్, ఈర్ష్, అసూయ్ యీ ధాతువుల యర్థము నిచ్చు క్రియలు ప్రయుక్తము లైనపు డెవరిపై కోపమో యాతడు సంప్ర దాన మగును.

ఉదా: హరయే క్రుధ్యతి/ద్రుహ్యతి/ఈర్ష్యతి/అసూయతి వా.

(2) క్రియార్థ క్రియ యుపపదముగా నున్నపుడు, తుమున్ ప్రయో గింపనిచో చతుర్థి వచ్చును.

ఉదా: ఫలేభ్యో యాతి. (ఫలములు తెచ్చుకొనుటకు పోవుచున్నాడు.)

(3) నమః, స్వస్తి, స్వాహా, స్వధా. అలం, వషట్ వీనితో సంబంధ మున్నచో చతుర్థి వచ్చును.

ఉదా. 1. హరయే నమః, 2. ప్రజాభ్యః స్వస్తి. 3. అగ్నయే స్వాహా, 4. పితృభ్యః స్వధా. 5. దైత్యేభ్యో హరి రలం/ప్రభుః/సమర్థః/శక్తః, 6. శిఖాయై వషట్.

5. అపాదాన కారకము - పంచమీ విభక్తి:

ప్రధానముగ నీ క్రింది సందర్భములలో పంచమీ విభక్తి వచ్చును.

1. అపాదానమున పంచమి వచ్చును. అపాదాన మనగా —

(i) ఎడబాటు లేక వేరగుట ఎచటినుండియో అది యపాదానము.

ఉదా: గ్రామాత్ ఆయాతి. గ్రామమునుండి విశ్లేషముకాన నది యపాదానము. ఇట్లే - ధావతః అశ్వాత్ పతతి.

(ii) భయార్థక, రక్షార్థక ధాతుప్రయోగ మున్నపుడు భయ కారణము అపాదాన మగును.

ఉదా: చోరాత్ బిభేతి, చోరాత్ త్రాయతే.

(iii) పరా పూర్వకమగు 'జి' ధాతువు ప్రయోగించినపుడు సహింప శక్యముగాని విషయము అపాదాన మగును.

ఉదా. అధ్యయనాత్ పరాజయతే, యుద్ధాత్ పరాజయతే.

(iv) వారించుట అనునర్థ మిచ్చు ధాతువులు ప్రయోగించుచో నిష్టమగు విషయము అపాదాన మగును.

ఉదా· యవేభ్యో గాం వారయతి.

(v) నియమపూర్వకముగ విద్యను గ్రహించునపుడు వక్త అపాదాన మగును.

ఉదా: ఉపాధ్యాయాత్ అధీతే.

(vi) పుట్టువానికి కారణమైన వా డపాదాన మగును.

ఉదా: బ్రహ్మణః ప్రజాః ప్రజాయంతే.

(vii) భూధాతు ప్రయోగమున కర్తకు కారణము అపాదాన మగును.

ఉదా: హిమవతః గంగా ప్రభవతి.

2. అన్య, ఆరాత్, ఇతర, ఋతే, దిక్ శబ్ద, అంచ్ ఉత్తరపద, ఆచ్, ఆహి ఈ ఎనిమిదితో సంబంధ మున్నచో పంచమి వచ్చును.

ఉదా. 1. అన్యః కృష్ణాత్, 2. ఆరాత్ వనాత్, 3. ఇతరః కృష్ణాత్, 4. ఋతే కృష్ణాత్, 5. పూర్వః గ్రామాత్, 6. ప్రాక్/ప్రత్యక్ వా గ్రామాత్, 7. దక్షిణా గ్రామాత్, 8. దక్షిణాహి గ్రామాత్.

3. అప, ఆఙ్, పరి అను కర్మప్రవచనీయలతో సంబంధ మున్నచో పంచమి వచ్చును.

ఉదా. అప హరేః సంసారః, పరి హరేః, సంసారః ఆ ముక్తేః సంసారః.

6. షష్ఠీ కారకము.

ప్రధానముగ నీ క్రింది సందర్భములలో షష్ఠీ విభక్తి వచ్చును.

2. స్వస్వామిభావము మున్నగు సంబంధమున షష్ఠి వచ్చును. కర్మ, కరణము మున్నగు వానికి కూడ సంబంధము మాత్రమే చెప్పదలంచినపుడు షష్ఠియే వచ్చును.

ఉదా॰ సతాం గతమ్, మాతుః స్మరతి, రామస్య పుస్తకమ్.

2. హేతు శబ్ద ప్రయోగము చేయబడి, హేతువు సూచింపబడుచో షష్ఠి వచ్చును.

ఉదా॰ అన్నస్య హేతోః వసతి.

3. కర్త్రర్థమున గాని కర్మార్థమున గాని కృత్సంబంధ మున్నచో షష్ఠి వచ్చును.

ఉదా: కృష్ణస్య కృతిః, జగతః కర్తా కృష్ణః.

7. అధికరణ కారకము — సప్తమీ విభక్తి.

ముఖ్యముగ నీ క్రింది సందర్భములలో సప్తమి వచ్చును.

1. అధికరణమున సప్తమి వచ్చును. అధికరణ మనగా—

(1) ఆధారము అధికరణ మనబడును.

ఉదా. కటే ఆస్తే, స్థాల్యాం పచతి, మోక్షే ఇచ్ఛా అస్తి.

(ii) స్వామీ, ఈశ్వర, అధిపతి, దాయాద, సాక్షి, ప్రతిభూ, ప్రసూత శబ్దములతో సంబంధమున్నచో సప్తమి వికల్పముగ వచ్చును.

ఉదా గవాం/గోషు స్వామీ, గవాం/గోషు ఈశ్వరః, ఇత్యాదులు.

## పారిభాషిక పదములు – వివరణము

1. ఉపదేశము.

ఆద్యోచ్చారణ ముపదేశమనబడును. ఈ క్రింది పేర్కొనబడినవి యుపదేశములని ప్రాచీనవ్యవహారము."ధాతు–సూత్ర–గణ–ఉణాది–వాక్య–లింగాను శాసనమ్। ఆగమ–ప్రత్యయ ఆదేశాః ఉపదేశాః ప్రకీర్తితాః॥"

2. ఇత్తులు:

మాహేశ్వర సూత్రముల చివరి వర్ణములు ఇత్తులు. లణ్ సూత్రమున 'అ' కారమును ఇత్సంజ్ఞకము. ఉపదేశములలో చివరనున్న హల్లు, అనునాసిక మగు అచ్చు ఇత్సంజ్ఞకములు. వీనికి ప్రత్యాహారసిద్ధి ప్రధాన ప్రయోజనము. ప్రత్యాహారములలో వీనిని గ్రహింపరాదు. ఆ యా ఇత్తులకు వేర్వేరు ప్రయోజనములును కలవు.

ఉదా: అ ఇ ఉ ణ్ లో ణ కార మిత్తనుటచే ణ కారముతో కూడి అకారము అణ్ ప్రత్యాహార మైనది. ఇట్లే టిత్తు (టకారము ఇత్తుగా కలది) కిత్తు, జిత్తు మొ॥

3. ప్రత్యాహారము:

అధికాక్షరములను సంగ్రహించి చెప్పునది ప్రత్యాహారము. మాహేశ్వర సూత్రములలో నే యిత్సంజ్ఞక వర్ణములోనైనను ముందు వర్ణమును కలిపి ప్రత్యాహారము చేయవచ్చును. ఆ ప్రత్యాహారము మొదటి యక్షరమును, ఇత్ వఱకు నడుమగల అక్షరములను సూచించును.

ఉదా. అక్. అ ఇ ఉ ఋ ౡ. అచ్. అ ఇ ఉ ఋ ౡ ఏ ఓ ఐ ఔ. ప్రత్యాహారములోని యక్షరములలో ఇత్తులకు పరిగణనము లేదు.

4. అనునాసికము.

ముక్కు, నోరు రెంటితో నుచ్చరింపబడు వర్ణము.

ఉదా: వర్గలలోని ఐదవ అక్షరములు_ఙ, ఞ......

5. హ్రస్వము.

లఘువు హ్రస్వ మనబడును. ఇది ఏకమాత్ర కలది. అచ్చుల భేదము.

ఉదా అ.

6. గురువు:

దీర్ఘము. గురువనబడును. ఇది ద్విమాత్రము. అచ్చుల భేదము. సంయోగము పరమగుచో హ్రస్వము గూడ గురువగును.

ఉదా॰ ఆగః, సమర్థః.

7. ప్లుతము.

ఇది మూడు మాత్రలు కలది. సంబోధనమున దీని యావశ్యకత కలదు. అచ్చులలో నొక ప్రభేదము. కృష్ణ 3 అత్ర గౌశ్చరతి. వ్రాతలో ప్లుతమని సూచించుట కచ్చునకు పిమ్మట 3 అంకె (మాత్రా సూచకము) వేయుట పరిపాటి.

8. ఉదాత్తము

ఆ యా భాగములతో గూడిన తాలువు మున్నగు స్థానములందు ఊర్ధ్వభాగమున బుట్టిన అచ్చు ఉదాత్తము.

ఉదా॰ ఆ యే.

9. అనుదాత్తము:

ఆ యా భాగములతోఁ గూడిత తాలువు మున్నగు స్థానములయందు అధోభాగమునఁ బుట్టిన యచ్చు అనుదాత్తము.

ఉదా॰ అర్వాక్.

10. స్వరితము॰

ఉదాత్తము, అనుదాత్తమను వర్ణధర్మములు రెండును ఏ యచ్చు నందు కలసి యుండునో నా యచ్చు స్వరిత మనబడును. స్వరితములో మొదటి సగము ఉదాత్తము రెండవ సగ మనుదాత్తము.

ఉదా క్వ వోశ్వాః.

11. సవర్ణము.

తాలువు దంతము మున్నగు స్థానము, స్పృష్టము, ఈషత్ స్పృష్టము మున్నగు ఆభ్యంతర ప్రయత్నము నే యచ్చున కే యచ్చుతో సమానమో అవి రెండును పరస్పరము సవర్ణము లనబడును.

ఉదా 'క' 'గ' కు సవర్ణము. రెంటికిని స్థానము కంఠము. ప్రయత్నము స్పృష్టము.

12. ఉదిత్తు:

ఉకార మిత్తుగా కలది. ఇవి ఐదు. కు, చు, టు, తు, పు. ఇవి ఆయా వర్గాక్షరములను సూచించును.

ఉదా కు అనగా క ఖ గ ఘ ఙ, చు అనగా చ ఛ జ ఝ ఞ.

13. జిహ్వామూలీయము

క ఖ ఈ యక్షరములకు ముందుండు విసర్గ జిహ్వామూలీయము. ఇది అర్ధ విసర్గ రూపమున నుండును.

ఉదా: కఁ కరోతి. కఁ ఖనతి.

14. ఉపధ్మానీయము.

ప ఫ ఈ యక్షరములకు ముందుండు విసర్గ ఉపధ్మానీయము. ఇది యర్ధవిసర్గ రూపమున నుండును.

ఉదా॰ కఁ పచతి. కఁ ఫలతి.

15. ప్రత్యయము

ఏదేని యొక ప్రాతిపదికకు గాని, ధాతువునకు గాని విధింపఁ బడునది ప్రత్యయము. ఇది యెప్పుడును పరముగ నే వచ్చును గాని పూర్వమున రాదు.

ఉదా రామ - స్ = రామః. అస్ - తి = అస్తి.

16. అల్పప్రాణములు·

వర్గముల ప్రథమ, తృతీయ, పంచమాక్షరములు, ప్రథమ తృతీయాక్షరముల యమ్ములు, య ర ల వ లు అల్పప్రాణములు.

17. మహాప్రాణములు:

వర్గముల ద్వితీయ, చతుర్థాక్షరములు వాని యమ్ములు శ ష స హ లు మహాప్రాణములు.వీని నుచ్చరించుటలో అధికముగ గాలిని విడువవలయును.

18. వృద్ధి:

దీర్ఘమగు ఆకారము ఐ,ఔ అను నక్షరములు 'వృద్ధి'యను పేరుకలవి.

19. గుణము

హ్రస్వమగు అకారముఏ,ఓఅను నక్షరములు'గుణ' మను పేరుకలవి.

20. అవసానము

వర్ణములు లేకుండుట అవసాన మనబడును. 'రామ' అనుచో 'మ' తరువాత అవసాన మున్నది.

21. పదము.

(i) సుబంతము, (ii) తిజన్తము పద మనబడును.

ఉదా రామః, గచ్ఛతి.

22. సంహిత.

అక్షరము లత్యంత సన్నిహితములై యుండుట. ఇది యున్న నే సంధికార్యము జరుగును.

23. సంయోగము

అచ్చు నడుమలేని హల్లుల కలయిక సంయోగ మనబడును.

ఉదా హర్మ్య. ఇచట రేఫ మకార యకార సంయోగమున్నది. గమ్య. ఇచట మకార, యకారసంయోగమున్నది. వీని నడుమ అచ్చు లేదు.

24. లోపము:

ప్రసక్తమైనది కనుపించకుండుట 'లోప' మనబడును. రామః ఆయాతి 'రామ ఆయాతి' ఇచట ప్రసక్తమైన విసర్గకు లోపము వచ్చినది.

25. స్పర్శములు

క మొదలు మ వఱకు కల, నైదు వర్గములలోని యైదైదు, మొత్తము ఇరువదియైదక్షరములకు స్పర్శములని పేరు.

26. విభాష:

నిషేధము, వికల్పమను నీ రెండును వ్యాకరణ శాస్త్రమున 'విభాష' యనబడును.

27. ప్రగృహ్యము·

ఈ, ఊ, ఏ అంతమందు కల ద్వివచనము ప్రగృహ్య మనబడును.

28. నిపాత.

'స్వర్' మున్నగు అవ్యయములు, నిపాతములు.

29. ఆమ్రేడితము

రెండుమార్లు చెప్పబడిన అక్షరము లేదా అక్షర సమూహములో రెండవసారి చెప్పబడినది ఆమ్రేడితము.

ఉదా పటత్ పటత్ ఇతి. ఇందు రెండవ పటత్‌శబ్ద మామ్రేడితము.

30. నిత్యము

ఎచట వ్యాకరణ సూత్రముచే విధింపబడిన కార్యము సర్వత్ర ప్రవర్తించునో అట్టి కార్యము నిత్యమనబడును.

31. టి

ఒక పదములోని చివరి యచ్చు మొదలుకొని తరువాతి వర్ణ సముదాయము.

ఉదా రామ. అకారము టి. అస్మత్, అత్-టి.

## కర్తరి ప్రయోగము – కర్మణి ప్రయోగము
### (కొన్ని యుదాహరణములు)

కర్తృవాచ్యమునుండి కర్మ వాచ్యమునకు:

1. గోపాలః పయః పిబతి.
   గోపాలేన పయః పీయతే.
2. బాలకః శునకం తాడయతి.
   బాలకేన శునకః తాడ్యతే.

3. శంకరః అశ్వం అపశ్యత్.
శంకరేణ అశ్వః అదృశ్యత.
4. పాచకః శాకం పచతి.
పాచకేన శాకః పచ్యతే.
5. వ్యాఘ్రః మృగం హన్తి.
వ్యాఘ్రేణ మృగః హన్యతే.

కర్మ వాచ్యమునుండి కర్తృ వాచ్యమునకు

1. దేవైః అమృతం సేవ్యతే.
దేవాః అమృతం సేవన్తే.
2. మనుజైః అన్నం భక్ష్యతే.
మనుజాః అన్నం భక్షయన్తి.
3. కృషీవలైః ధాన్యం నీయతే.
కృషీవలాః ధాన్యం నయన్తి.
4. రాజ్ఞా ప్రజాః పాల్యన్తే.
రాజా ప్రజాః పాలయతి.
5. రామేణ సీతా పరిత్యక్తా.
రామః సీతాం పరిత్యక్తవాన్.

ఈ ప్రయోగములకు సంబంధించిన వ్యాకరణాంశములు ధాతు ప్రకరణమున కర్మణి ప్రయోగ సందర్భమున వివరించబడినవి.

## అనాదర షష్ఠి

అనాదర సూచకముగ గూడ షష్ఠి వాడబడును. దీనిని సత్ షష్ఠి యందురు. అనగా సత్ శబ్దముతో సంబంధము కల షష్ఠి యని యర్థము.

ఉదా 1. పుత్రాదేః రుదతః (సతః) ప్రావ్రాజీత్.
కుమారుఁడు మున్నగువారేడ్చుచున్నను (వారి ననాదరము చేసి)
యాతఁడు సన్న్యసించెను.

2. తాడయతః అధికృతః (సతః) చోరః దోషం నాఙ్గీచకార.

అధికారి దండించుచున్నను (అతని ననాదరము చేసి) దొంగ
తప్పొప్పుకొనలేదు.

## సత్సప్తమి

సచ్ఛబ్దముతో సంబంధము గల సప్తమి సత్సప్తమి.

ఉదా: 1. గోషు దుహ్యమానాసు (సతీషు) గతః.
ఆవులు పిదుకబడుచుండగా వాడు వెడలెను.

2. దుష్టేషు బలవత్సు (సత్సు) సన్తః క్లిశ్యంతే.
దుష్టులు బలవంతులు కాగా సజ్జనులు పీడింపబడుదురు.

## వాక్య నిర్మాణము

సంస్కృతమున వాక్యరచన చేయుటలో కర్త్రాది పదములకును, క్రియాపదమునకును స్థాన నియమము ఆంగ్లమున వలె లేనే లేదు. సుందర పద బంధము ననుసరించి గద్య పద్యములు రెంటిలో నెచ్చటనైనను, ఏ పదమైనను ముందు వెనుకలుగ ప్రయోగింపవచ్చును. దీనిచే నా వాక్యపు భావ మేమాత్రము మారదు. కాగా, 'ఏవ' మున్నగు పదములు మాత్రము తత్సంబద్ధమగు పదము తరువాతనే ప్రయోగింపనగును. కొన్ని సందర్భములలో ప్రశ్నార్థము తెలియజేయుటకు కిం శబ్దమునకు బదులు అపి మున్నగు పదములు వాక్యాదిని ప్రయోగించుదురు. ఉదాహరణములు.

1. ఉజ్జయినీ నామ నగరీ భారతేషు అస్తి. సాధారణ వాక్యము.
భారతేషు ఉజ్జయినీ నామ నగరీ అస్తి లేక
అస్తి భారతేషు ఉజ్జయినీ నామ నగరీ. ఇత్యాది.

2. ప్రశ్నార్థమున. కిం త్వం గ్రామం అగచ్ఛః?
అపి త్వం గ్రామం అగచ్ఛః?

---

సంస్కృతభాషను యింకను అధ్యయనము చేయగోరు జిజ్ఞాసువులకై యింకను కొన్ని శబ్దముల నిటు యిచ్చితిమి.

(i) విభక్తులను వేర్వేరు పంక్తులలో వ్రాయక ప్రథమాది విభక్తుల వరుసలో నిచ్చితిమి. । ఈ గుర్తు విభక్త్యంత సూచకము.

(ii) ఒకే వచనమున 2, 3 రూపములున్న 'కామా' చే నా భిన్న రూపముల తెలిపితిమి. 80 వ శబ్దపు ద్వితీయా బహువచనమున "నిశః, నిశాః" అని రెండు రూపములు గలవు. ఆ రెంటి మధ్య 'కామా' పెట్టితిమి. ఇట్లే మిగిలినచోట్ల గ్రహింపుడు.

(iii) సంబోధన ప్రథమ ద్వి. బ. వచనములు ప్రథమ ద్వి. బ. వచనములవలెనే యుండును కావున వాటిని చూపలేదు. భిన్నముగానున్న సం. ప్ర. ఏ. వచనమును మాత్రము శబ్దాంత కుండలీకరణమున చూపితిమి. సం. ప్ర. లో 'హే' చేరును.

(iv) ఏకరూపము గల శబ్దములయొక్క విభక్త్యాద్యక్షరమును కుండలీకరణమున సూచించితిమి.

(v) కుండలీకరణములోని మొదటి సంఖ్య 'పేజి' ని, రెండవ సంఖ్య 'శబ్ద సంఖ్య' ను తెలుపును.

## అజంతములు

### (పుంలింగ శబ్దములు)

68. అకారాన్తః పుంలింగః 'ఉభ' శబ్దః – ఇద్దరు. (నిత్యవచనము: ఉభౌ (ప్ర. ద్వి) ఉభాభ్యాం (తృ. చ. పం) ఉభయోః ష. స.)

69. అకారాన్తః పులింగః 'ఉభయ' శబ్దః – రెండవయవములు గలది (ద్వివచన రహితము) ఉభయః ఉభయే । ఉభయం ఉభయాన్ । ఉభయేన ఉభయైః । ఉభయస్మై ఉభయేభ్యః । ఉభయస్మాత్ ఉభయేభ్యః । ఉభయస్య ఉభయేషామ్ । ఉభయస్మిన్ ఉభయేషు॥

70. అకారాన్తః పుంలింగః *'మాస' శబ్దః – నెల. మాసః మాసౌ మాసాః । మాసం మాసౌ మాసాన్ । మాసేన మాసాభ్యాం మాసైః । మాసాయ మాసాభ్యాం మాసేభ్యః । మాసాత్ మాసాభ్యాం మాసేభ్యః । మాసస్య మాసయోః మాసానాం । మాసే మాసయోః మాసేషు॥

---

* ఇదే అర్థమున సకారాన్తమున 'మాస్' అని శబ్దము గలదు.

మాః మాసౌ మాసః । మాసం మాసౌ మాసః । మాసా మాభ్యాం మాభిః । మాసే మాభ్యాం మాభ్యః । మాసః మాభ్యాం మాభ్యః । మాసః మాసోః మాసామ్ । మాసి మాసోః మాస్సు॥

71. ఇకారాన్తః పుంలింగః 'సఖి' శబ్దః – స్నేహితుడు – సఖా సఖాయౌ సఖాయః । సఖాయం సఖాయౌ సఖీన్ । సఖ్యా సఖిభ్యాం సఖిభిః । సఖ్యే సఖిభ్యాం సఖిభ్యః । సఖ్యుః సఖిభ్యాం సఖిభ్యః । సఖ్యుః సఖ్యోః సఖీనాం । సఖ్యౌ సఖ్యోః సఖిషు॥ (హే సఖే)

72. ఇకారాన్తః పుంలింగః 'పతి' శబ్దః – భర్త (3–3) పతిః పతీ పతయః । పతిం పతీ పతీన్ । పత్యా పతిభ్యాం పతిభిః । పత్యే పతిభ్యాం పతిభ్యః । పత్యుః పతిభ్యాం పతిభ్యః । పత్యుః పత్యోః పతీనాం । పత్యౌ పత్యోః పతిషు॥ (పతే)

73. ఇకారాన్తః పుంలింగః 'కతి' శబ్దః – ఎన్ని (నిత్య బహు వచనము) కతి (ప్ర. ద్వి.) కతిభిః (తృ. చ. పం.) కతీనాం । కతిషు॥

74. ఈకారాన్తః పుంలింగః 'ప్రధీ' శబ్దః – మిక్కిలి ధ్యానించు వాడు. ప్రధీః ప్రధ్యౌ ప్రధ్యః । ప్రధ్యం ప్రధ్యౌ ప్రధ్యః । ప్రధ్యా ప్రధీభ్యాం ప్రధీభిః । ప్రధ్యే ప్రధీభ్యాం ప్రధీభ్యః । ప్రధ్యః ప్రధీభ్యాం ప్రధీభ్యః । ప్రధ్యః ప్రధ్యోః ప్రధ్యాం । ప్రధ్యి ప్రధ్యోః ప్రధీషు॥ ఇట్లే 'గ్రామణీ, సేనానీ, అగ్రణీ' మొ॥

కాని వీని సప్తమి ఏ. వ. లో 'గ్రామణ్యాం', 'సేనాన్యాం', 'అగ్రణ్యాం' గా మారును.

75. ఈకారాన్తః పుంలింగః 'సుధీ' శబ్దః – విద్వాంసుడు. సుధీ సుధియౌ సుధియః । సుధియం సుధియౌ సుధియః । సుధియా సుధీభ్యాం సుధీభిః । సుధియే సుధీభ్యాం సుధీభ్యః । సుధియః సుధీభ్యాం సుధీభ్యః । సుధియః సుధియోః సుధియాం । సుధియి సుధియోః సుధీషు॥ ఇట్లే 'సుశ్రీః' 'శుద్ధధీః' మొ॥

76. ఊకారాన్తః పుంలింగః 'స్వభూ' శబ్దః – బ్రహ్మ. స్వభూః స్వభువౌ స్వభువః । స్వభువం స్వభువౌ స్వభువః । స్వభువా స్వభూభ్యాం

స్వభూభిః । స్వభువే స్వభూభ్యాం స్వభూభ్యః । స్వభువః స్వభూభ్యాం స్వభూభ్యః । స్వభువః స్వభువోః స్వభువాం । స్వభువి స్వభువోః స్వభూషు॥ ఇట్లే 'ఆత్మభూః, స్వయంభూః' మొ॥

77. ఋకారాన్తః పుం లింగః 'నృ' శబ్దః – నరుడు. నా నరౌ నరః । నరం నరౌ నౄన్ । న్రా నృభ్యాం నృభిః । న్రే నృభ్యాం నృభ్యః । నుః నృభ్యాం నృభ్యః । నుః న్రోః నృణాం, నౄణామ్ । నరి న్రోః నృషు॥ (నః)

78. ఐకారాన్తః పుం లింగః 'రై' శబ్దః – ధనము. రాః రాయౌ రాయః । రాయం రాయౌ రాయః । రాయా రాభ్యాం రాభిః । రాయే రాభ్యాం రాభ్యః । రాయః రాభ్యాం రాభ్యః । రాయః రాయోః రాయాం । రాయి రాయోః రాసు॥

79. ఔకారాన్తః పుం లింగః 'గ్లౌ' శబ్దః – చంద్రుడు. గ్లౌః గ్లావౌ గ్లావః । గ్లావం గ్లావౌ గ్లావః । గ్లావా గ్లౌభ్యాం గ్లౌభిః । గ్లావే గ్లౌభ్యాం గౌభ్యః । గ్లావః గ్లౌభ్యాం గ్లౌభ్యః । గ్లావః గ్లావోః గ్లావాం । గ్లావి గ్లావోః గ్లౌషు॥ ఇట్లే 'నౌ, సునౌ' మొ॥

## స్త్రీ లింగ శబ్దములు

80. ఆకారాన్త స్త్రీ లింగః 'నిశా' శబ్దః – రాత్రి (దీని ద్వి. బ. వ. నుండి రెండేసి రూపములు) నిశా నిశే నిశాః । నిశాం నిశే నిశః, నిశాః । నిశయా, నిశా నిశాభ్యాం, నిడ్భ్యాం నిశాభిః నిడ్భిః । నిశాయై, నిశే నిశాభ్యాం, నిడ్భ్యాం నిశాభ్యః, నిడ్భ్యః । నిశాయాః, నిశః నిశాభ్యాం, నిడ్భ్యాం నిశాభ్యః, నిడ్భ్యః । నిశాయాః, నిశః నిశయోః, నిశోః నిశానాం, నిశాం । నిశాయాం, నిశి నిశయోః, నిశోః నిశాసు, నిట్సు, నిట్సు॥ మొ॥

81. ఆకారాన్త స్త్రీ లింగః 'జరా' శబ్దః – ముసలితనము. జరా । జరే, జరసౌ జరాః, జరసః । జరాం, జరసం జరే, జరసౌ జరాః, జరసః । జరయా, జరసా జరాభ్యాం జరాభిః । జరాయై, జరసే జరాభ్యాం జరాభ్యః ।

జరాయాః, జరసః జరాభ్యాం జరాభ్యః । జరాయాః, జరసః జరయోః, జరసోః జరాణాం, జరసాం । జరాయాం, జరసి జరయోః, జరసోః జరాసు॥ (జరే)

82. ఇకారాన్తః స్త్రీ లింగః 'మతి' శబ్దః - బుద్ధి ( — ) మతిః మతీ మతయః । మతిం మతీ మతీః । మత్యా మతిభ్యాం మతిభిః । మత్యై, మతయే మతిభ్యాం మతిభ్యః । మత్యాః, మతేః మతిభ్యాం మతిభ్యః । మత్యాః, మతేః మత్యోః మతీనాం । మత్యాం, మతౌ మత్యోః మతిషు॥ 'రుచిః, ఘృణిః, శ్రుతిః'' మొ॥

83. ఊకారాన్త స్త్రీ లింగః 'భ్రూ' శబ్దః - కనుబొమ. ( –76) భ్రూః భ్రువౌ భ్రువః...మిగిలిన అన్ని రూపములు 'స్వభూ' శబ్దమువలె.

84. ఋకారాంత స్త్రీ లింగః 'మాతృ' శబ్దః - తల్లి. (4–6) మాతా మాతరౌ మాతరః । మాతరం మాతరౌ మాతౄః॥ మిగిలిన రూపములు 'పితృ' శబ్దమువలె. 'యాతా, 'ననాందా' మొ॥

85. ఋకారాన్త స్త్రీ లింగః 'స్వసృ' శబ్దః - చెల్లెలు. (84) స్వసా స్వసారౌ స్వసారః । స్వసారం స్వసారౌ స్వసౄః...మిగిలినవి 'మాతృ' వలె॥ (స్వసః)

## నపుంసక లింగ శబ్దములు

86. అకారాన్త నపుంసక లింగః 'హృదయ' శబ్దః - హృదయము. హృదయం హృదయే హృదయాని । హృదయం హృదయే హృంది, హృదయాని । హృదా, హృదయేన హృద్భ్యాం, హృదయాభ్యాం హృద్భిః, హృదయైః । హృదే, హృదయాయ హృద్భ్యాం, హృదయాభ్యాం హృద్భ్యః, హృదయేభ్యః । హృదః, హృదయాత్ హృద్భ్యాం, హృదయాభ్యాం హృద్భ్యః, హృదయేభ్యః । హృదః, హృదయస్య హృదోః, హృదయోః హృదాం, హృదయానాం । హృది, హృదయే హృదోః, హృదయోః హృత్సు, హృదయేషు॥ (హృదయ)

87. అకారాన్త నపుంసక లింగః 'ఆస్య' శబ్దః - ముఖము. ఆస్యం

ఆస్యే ఆస్యాని । ఆస్యం ఆస్యే ఆసాని, ఆస్యాని । ఆస్నా, ఆస్యేన ఆస భ్యాం, ఆసాభ్యాం ఆసభిః, ఆస్యైః । ఆస్నే, ఆస్యాయ ఆసభ్యాం, ఆస్యాభ్యాం ఆసభ్యః, ఆస్యేభ్యః । ఆస్నః, ఆస్యాత్ ఆసభ్యాం, ఆస్యా భ్యాం ఆసభ్యః, ఆస్యేభ్యః । ఆస్నః, ఆస్యస్య ఆస్నోః, ఆస్యయోః ఆస్నాం, ఆస్యానాం । ఆస్ని, ఆసని, ఆస్యే ఆస్నోః ఆస్యయోః ఆసను, ఆస్యేషు॥ (ఆస్య)

88. అకారాన్త నపుంసక లింగః 'ఉదక' శబ్దః – నీరు. 'ఉదక' శబ్ద రూపములన్ని 87 వలెనె. కాని యిట* 'ఆస్నా' వలె 'ఉద్నా' 'ఆస్యేన' – 'ఉదకేన' । 'ఆసభ్యాం' – 'ఉదభ్యాం' । 'ఆసాభ్యాం' – 'ఉదకాభ్యాం' – 86–87–88 శబ్దములలోని రెండేసి రూపములు బాగా గమనింపుడు.

89. అకారాన్త నపుంసక లింగః 'మాంస' శబ్దః – మాంసము. మాంసం మాంసే మాంసాని । మాంసం మాంసే మాంసి, మాంసాని । మిగిలిన రూ. 'హృదయ' శబ్దమువలె.

90. ఇకారాన్త నపుంసక లింగః 'దధి' శబ్దః – పెరుగు. దధి దధినీ దధీని (ప్ర. ద్వి) దధ్నా దధిభ్యాం దధిభిః । దధ్నే దధిభ్యాం దధి భ్యః । దధ్నః దధిభ్యాం దధిభ్యః । దధ్నః దధ్నోః దధ్నాం । దధ్ని, దధని దధ్నోః దధిషు॥ (హే దధే, హే దధి) ఇట్లే అక్షి, అస్థి, సక్థి మొ॥ (7–15)

## హలంత – పుంలింగ శబ్దములు

91. చకారాన్తః పుంలింగః 'ప్రాఞ్' శబ్దః – ప్రాచీనుడు. ప్రాఞ్ ప్రాఞ్చౌ ప్రాఞ్చః । ప్రాఞ్చం ప్రాఞ్చౌ ప్రాచః । ప్రాచా ప్రాగ్భ్యాం ప్రాగ్భిః॥ మిగిలినవి 'జలముక్' వలె (9–19). ఇట్లే పరాఞ్, అవాఞ్ మొ॥

92. చకారాన్తః పుంలింగః 'ప్రత్యఞ్' శబ్దః – ఆత్మ. ప్రత్యఞ్ ప్రత్యఞ్చౌ ప్రత్యఞ్చః । ప్రత్యఞ్చం ప్రత్యఞ్చౌ ప్రతీచః । ప్రతీచా

ప్రత్యగ్భ్యాం ప్రత్యగ్భిః॥ 'ప్రాఞ్' వలెనె. కాని ఏకవచనమున రెండవ అక్షరము 'తీ' గా మారును.

93. చకారాన్తః పుంలింగః 'ఉదఞ్' శబ్దః – ఉత్తరపువాడు. ఉదఞ్ ఉదఞ్చౌ ఉదఞ్చః॥ 'ప్రత్యఞ్' వలెనే.

94. చకారాన్తః పుంలింగః 'తిర్యఞ్' శబ్దః – పశువు. తిర్యఞ్ తిర్యఞ్చౌ తిర్యఞ్చః। తిర్యఞ్చం తిర్యఞ్చౌ* తిరశ్చః। తిరశ్చా తిర్యగ్భ్యాం తిర్యగ్భిః। తిరశ్చే తిర్యగ్భ్యాం తిర్యగ్భ్యః। తిరశ్చః తిర్యగ్భ్యాం తిర్యగ్భ్యః। తిరశ్చః తిరశ్చోః తిరశ్చాం। తిరశ్చి తిరశ్చోః తిర్యక్షు॥

95. జకారాన్తః పుం లింగః 'రాట్' శబ్దః – రాజు. రాట్ రాజౌ రాజః॥ మిగిలినవి 'భిషక్' వలె, కాని తృతీయాది విభక్తుల ద్వి. బ. వచనములలో 'రాడ్భ్యాం, రాడ్భిః' లుగా అన్నిట మారును. (9_20)

96. జకారాన్తః పుంలింగః 'పరివ్రాట్' శబ్దః – సన్యాసి. పరివ్రాట్ పరివ్రాజౌ పరివ్రాజః 'భిషక్' వలె, కాని ఇట 'డ్భ్యాం, డ్భిః' లుగా మారును. సప్తమీ బ. వ. రెండు రూపములు – 'పరివ్రాట్త్సు, పరివ్రాట్సు'.

97. జకారాన్తః పుం లింగః 'భృట్' శబ్దః – వంటవాడు. భృట్, భృడ్ భృజ్జౌ భృజ్జః। భృజ్జం భృజ్జౌ భృజ్జః। భృజ్జా భృడ్భ్యాం భృడ్భిః। భృజ్జే భృడ్భ్యాం భృడ్భ్యః। భృజ్జః భృడ్భ్యాం భృడ్భ్యః। భృజ్జః భృజ్జోః భృజ్జాం। భృజ్జి భృజ్జోః భృట్త్సు, భృట్సు॥

98. తకారాన్తః పుం లింగః 'మహత్' శబ్దః – గొప్పవాడు. మహాన్ మహాన్తౌ మహాన్తః। మహాన్తం మహాన్తౌ మహతః। మహతా మహద్భ్యాం మహద్భిః॥ 'మరుత్' వలె (10_21) (మహాన్).

99. ధకారాన్తః పుం లింగః 'బుధ్' శబ్దః – తెలిసినవాడు. భుత్, భుద్ బుధౌ బుధః। బుధం బుధౌ బుధః। బుధా భుద్భ్యాం భుద్భిః। బుధే భుద్భ్యాం భుద్భ్యః। బుధః భుద్భ్యాం భుద్భ్యం। బుధః బుధోః బుధాం। బుధి బుధోః భుత్సు॥

100. నకారాన్తః పుంలింగః 'మఘవన్' శబ్దః – ఇంద్రుడు. మఘవా మఘవానౌ మఘవానః। మఘవానం మఘవానౌ మఘోనః। మఘోనా మఘవభ్యాం మఘవభిః మిగిలిన అన్ని రూపములు 'ఆత్మన్' వలె, కాని ఏకవచనములలో 'ఆత్మనే' అని, అందు ఇట 'మఘోనే' అని 'ఘ' బదులు 'ఘో' గా మారును. ఇదే అర్థమందు తకారాన్త శబ్దముకూడా కలదు. మఘవాన్ మఘవన్తౌ మఘవన్తః॥ (హే మఘవన్)

101. నకారాన్తః పుం లింగః 'శ్వన్' శబ్దః – కుక్క. శ్వా శ్వానౌ శ్వానః। శ్వానం శ్వానౌ శునః। శునా శ్వభ్యాం శ్వభిః। శునే శ్వభ్యాం శ్వభ్యః। శునః శ్వభ్యాం శ్వభ్యః। శునః శునోః శునాం। శుని శునోః శ్వసు॥ (హే శ్వన్)

102. నకారాన్తః పుం లింగః 'యువన్' శబ్దః – యువకుడు. యువా యువానౌ యువానః। యువానం యువానౌ యూనః। యూనా యువభ్యాం యువభిః। యూనే యువభ్యాం యువభ్యః। యూనః యువభ్యాం యువభ్యః। యూనః యూనోః యూనాం। యూని యూనోః యువసు॥ (యువన్)

103. నకారాన్తః పుం లింగః 'పథిన్' శబ్దః – మార్గము. పన్థాః పన్థానౌ పన్థానః। పంథానం పన్థానౌ పథః। పథా పథిభ్యాం పథిభిః। పథే పథిభ్యాం పథిభ్యః। పథః పథిభ్యాం పథిభ్యః। పథః పథోః పథాం। పథి పథోః పథిషు॥ ఇట్లే 'మన్థాః'.

104. పకారాన్తః పుం లింగః 'గుప్' శబ్దః – రక్షకుడు. గుప్, గుబ్ గుపౌ గుపః। గుపం గుపౌ గుపః। గుపా గుబ్భ్యాం గుబ్భిః। గుపే గుబ్భ్యాం గుభ్యః। గుపః గుబ్భ్యాం గుభ్యః। గుపః గుపోః గుపాం। గుపి గుపోః గుప్సు॥

105. శకారాన్తః పుం లింగః 'తాదృక్' శబ్దః – అట్టివాడు, తాదృక్, తాదృగ్ తాదృశౌ తాదృశః। మిగిలిన రూపము 'గుప్' వలె, కాని ఇట ద్వి. వ. లో 'గ్భ్యాం', 'గ్భిః' లుగా మారును. స–బ–వ–న 'తాదృక్షు'॥

106. శకారాన్తః పుం లింగః 'విట్' శబ్దః – మనుష్యుడు. విట్ విశౌ విశః । విశం విశౌ విశః । విశా విడ్భ్యాం విడ్భిః । విశే విడ్భ్యాం విడ్భ్యః । విశః విడ్భ్యాం విడ్భ్యః । విశః విశోః విశాం । విశి విశోః విట్సు॥

107. షకారాన్తః పుం లింగః 'ద్విట్' శబ్దః – శత్రువు. ద్విట్ ద్విషౌ ద్విషః । మిగిలిన రూపములు 'విట్' వలె, ఇట 'శ' బదులు 'ష' వుండును.

108. షకారాన్తః పుం లింగః 'దోష్' శబ్దః – బాహువు. దోః దోషౌ దోషః । దోషం దోషౌ దోషః, దోష్ణః । దోషా దోష్ణా దోర్భ్యాం, దోషభ్యాం దోర్భిః, దోషభిః । దోషే, దోష్ణే దోర్భ్యాం, దోషభ్యాం దోర్భ్యః, దోషభ్యః । దోషః దోష్ణః, దోర్భ్యాం, దోషభ్యాం, దోర్భ్యః, దోషభ్యః । దోషః, దోష్ణః, దోషోః, దోష్ణోః, దోషాం, దోష్ణాం । దోషి, దోష్ణి, దోషణి, దోషోః, దోష్ణోః దోష్షు, దోఃషు, దోషసు॥

109. సకారాన్తః పుం లింగః 'పుంస్' శబ్దః – పురుషుడు. పుమాన్ పుమాంసౌ పుమాంసః । పుమాంసం పుమాంసౌ పుంసః । పుంసా పుంభ్యాం పుంభిః । పుంసే పుంభ్యాం పుంభ్యః । పుంసః పుంభ్యాం పుంభ్యః । పుంసః పుంసోః పుంసాం । పుంసి పుంసోః పుంస్సు॥ ('పుమన్')

110. షకారాన్తః పుం లింగః 'తురాషాట్' శబ్దః – ఇంద్రుడు. తురాషాట్ తురాసాహౌ తురాసాహః । తురాసాహం తురాసాహౌ తురాసాహః । తురాసాహా తురాషాడ్భ్యాం తురాషాడ్భిః । తురాసాహే తురాషాడ్భ్యాం తురాషాడ్భ్యః । తురాసాహః తురాషాడ్భ్యాం తురాషాడ్భ్యః । తురాసాహః తురాసాహోః తురాసాహాం । తురాసాహి తురాసాహోః తురాషాట్సు, తురాషాట్త్సు॥

111. షకారాన్తః పుం లింగః 'లిట్' శబ్దః – ఆస్వాదించువాడు. (ఇది విశేష్య నిఘ్నము) లిట్ లిహౌ లిహః । అన్ని రూపములు 'తురాషాట్' వలెనె. స. బ. వ. 'లిట్సు' అని మాత్రమే. వీని వలెనె 'మహీరుట్'.

## స్త్రీ లింగ శబ్దములు

112. దకారాన్తః స్త్రీ లింగః 'సంపద్' శబ్దః - సంపద
సంపత్ సంపద్-సంపదౌ సంపదః - మిగిలినవి 'దివిషద్' వలె.

113. భకారాన్తః స్త్రీ లింగః - 'కకుప్' శబ్దః - దిక్కు.
కకుప్ కకుభౌ కకుభః । కకుభం కకుభౌ కకుభః । కకుభా కకుభ్యాం కకుభిః । కకుభే కకుబ్భ్యాం కకుబ్భ్యః । కకుభః కకుబ్భ్యాం కకుబ్భ్యః । కకుభః కకుభోః కకుభాం । కకుభి కకుభోః కకుప్సు॥

114. రేఫాన్తః స్త్రీ లింగః 'ద్వార్' శబ్దః-ద్వారము. (13-33)
ద్వాః ద్వారౌ ద్వారః - మిగిలిన రూపములు 'గిర్' శబ్దములవలె స. బహు వచనమున 'ద్వార్షు' 'ద్వాఃషు' అని రెండు రూపములు.

115. షకారాంతః స్త్రీ లింగః 'త్విట్' శబ్దః - కాంతి ( - )
త్విట్ త్విషౌ త్విషః - మిగిలినవి 'ద్విట్' వలె.

116. సకారాంతః స్త్రీ లింగః 'ఆశిస్' శబ్దః - ఆశీర్వచనము.
ఆశీః ఆశిషౌ ఆశిషః । ఆశిషం ఆశిషౌ ఆశిషః । ఆశిషా ఆశీర్భ్యాం ఆశీర్భిః । ఆశిషే ఆశీర్భ్యాం ఆశీర్భ్యః । ఆశిషః ఆశీర్భ్యాం ఆశీర్భ్యః । ఆశిషః ఆశిషోః ఆశిషాం । ఆశిషి ఆశిషోః ఆశీష్షు॥

117. సకారాంతః స్త్రీ లింగః 'భాస్' శబ్దః - కాంతి. భాః భాసౌ భాసః । భాసం భాసౌ భాసః । భాసా భాభ్యాం భాభిః । భాసే భాభ్యాం భాభ్యః । భాసః భాభ్యాం భాభ్యః । భాసః భాసోః భాసాం । భాసి భాసోః భాస్సు॥

## (a) నపుంసక లింగ శబ్దములు

118. జకారాన్త నపుంసక లింగః 'అసృక్' శబ్దః - రక్తము.
అసృక్ అసృజీ అసృఞ్జి । అసృక్ అసృజీ అసాని, అసృఞ్జి । అస్నా, అసృజా అసగ్భ్యాం, అసృగ్భ్యాం అసభిః, అసృగ్భిః । అస్నే, అసృజే అసభ్యాం, అసృగ్భ్యాం అసభ్యః, అసృగ్భ్యః । అస్నః, అసృజః

అసభ్యాం, అసృగ్భ్యాం అసభ్యః, అసృగ్భ్యః । అస్నః, అసృజః
అస్నోః, అసృజోః అస్నాం, అసృజాం॥

119. తకారాన్త నపుంసక లింగః 'జాగ్రత్' శబ్దః - (10-21)
జాగ్రత్ జాగ్రతీ జాగ్రన్తి, జాగ్రతి...మిగిలిన రూపములు 'మరుత్' వలె.
ఇట్లే జక్షత్, దధత్, దతత్, జుహ్వత్, శాసత్ మొ॥

120. సకారాంత నపుంసక లింగః 'ధనుస్' శబ్దః - విల్లు (14-35)
ధనుః ధనుషీ ధనూంషి (ప్ర. ద్వి) మిగిలిన అన్ని రూపములు 'దిక్' వలె,
కాని యిందు 'శ' బదులు 'ష' పలుకవలెను. (దిశా) ధనుషా, । స. బ. వ.
ధనుష్షు, ధనుఃషు॥

## (b) సంఖ్యావాచక శబ్దములు

121. అకారాన్తః పుం లింగ 'ఏక' శబ్దః - నిత్యైకవచనాన్తః -
ఒకడు. ఏకః, హే ఏక, ఏకమ్, ఏకేన, ఏకస్మై, ఏకస్మాత్, ఏకస్య,
ఏకస్మిన్.

122. ఇకారాన్తః పుం లింగో 'ద్వి' శబ్దః - నిత్యద్వివచనాన్తః -
ఇద్దఱు. ద్వౌ, ద్వౌ, ద్వాభ్యామ్, ద్వాభ్యామ్, ద్వాభ్యామ్, ద్వయోః,
ద్వయోః.

123. ఇకారాన్తః పుం లింగ 'త్రి' శబ్దః - నిత్యబహువచనాన్తః -
ముగ్గురు. త్రయః, త్రీన్, త్రిభిః, త్రిభ్యః, త్రిభ్యః, త్రయాణామ్, త్రిషు.

124. రేఫాన్తః పుం లింగః 'చతుర్' శబ్దః - నిత్యబహువచనాన్తః -
నలుగురు. చత్వారః, చతురః, చతుర్భిః, చతుర్భ్యః, చతుర్భ్యః, చతు
ర్ణామ్, చతుర్షు.

125. నకారాన్తః పుం లింగః 'పఞ్చన్' శబ్దో - నిత్యబహు
వచనాన్తః - ఐదుగురు. పఞ్చ, పఞ్చ, పఞ్చభిః, పఞ్చభ్యః పఞ్చభ్యః,
పఞ్చానామ్, పఞ్చసు (ఇట్లే సప్త, నవ, దశ శబ్దములు చెప్పుకొనవలెను).

126. షకారాన్తః పుం లింగః 'షట్' శబ్దః - నిత్యబహువచనా
న్తః - ఆరుగురు. షట్, షట్, షడ్భిః, షడ్భ్యః, షడ్భ్యః, షణ్ణామ్,
షట్సు.

127. నకారాన్తః పుం లిఙ్గో 'అష్ట'న్శబ్దోః - నిత్యబహువచనాన్తః - ఎనమండ్రుడు. ప్ర. అష్టౌ-అష్ట, ద్వి. అష్టౌ-అష్ట, తృ. అష్టాభిః-అష్టభిః, చ. అష్టాభ్యః-అష్టభ్యః, పం. అష్టాభ్యః-అష్టభ్యః, ష. అష్టానామ్, స. అష్టాసు-అష్టసు.

128. ఆకారాన్తః స్త్రీ లిఙ్గః 'ఏకా' శబ్దః - నిత్యైకవచనాన్తః - ఒకతె. ఏకా, హే ఏకే, ఏకామ్, ఏకయా, ఏకస్యై, ఏకస్యాః, ఏకస్యాః ఏకస్యామ్.

129. ఇకారాన్తః స్త్రీ లిఙ్గో 'ద్వి' శబ్దః - నిత్యద్వివచనాన్తః - ఇద్దఱు (స్త్రీలు). ద్వే, ద్వే, ద్వాభ్యామ్, ద్వాభ్యామ్, ద్వాభ్యామ్, ద్వయోః, ద్వయోః.

130. ఇకారాన్తః స్త్రీ లిఙ్గః 'త్రి' శబ్దో - నిత్యబహువచనాన్తః - ముగ్గురు (స్త్రీలు). తిస్రః, తిస్రః, తిసృభిః, తిసృభ్యః, తిసృభ్యః, తిసృణామ్, తిసృషు.

131. రేఫాన్తః స్త్రీ లిఙ్గ శ్చతుశ్శబ్దో నిత్యబహువచనాన్తః - నలుగురు (స్త్రీలు). చతస్రః, చతస్రః, చతసృభిః, చతసృభ్యః, చతసృభ్యః, చతసృణామ్, చతసృషు. (పఞ్చ, షట్, సప్త, అష్టౌ, నవ, దశ. ఈ యాఱు శబ్దములును మూడు లింగములయందును సమాన రూపములు.)

132. అకారాన్తః నపుంసక లిఙ్గః 'ఏక' శబ్దః నిత్యైకవచనాన్తః- ఒకటి. ఏకమ్, ఏకమ్, ఏకేన, ఏకస్మై, ఏకస్మాత్, ఏకస్య, ఏకస్మిన్ః (స్త్రీ నపుంసక లింగములందు ద్విశబ్దము సమానముగా నుండును).

133. ఇకారాన్తః నపుంసక లిఙ్గః 'త్రి' శబ్దో - నిత్యబహువచనాన్తః-మూడు. త్రీణి, త్రీణి, త్రిభిః, త్రిభ్యః, త్రిభ్యః, త్రయాణామ్, త్రిషు.

134. రేఫాన్తః నపుంసక లిఙ్గః 'చతు'శ్శబ్దః - నిత్యబహువచనాన్తః - నాలుగు చత్వారి, చత్వారి, చతుర్భిః, చతుర్భ్యః, చతుర్భ్యః, చతుర్ణామ్, చతుర్షు.

135. అకారాన్తః పుం లిఙ్గః 'ప్రథమ' శబ్దః - మొదటివాడు.

ప్రథమః, ప్రథమౌ, ప్రథమే, ప్రథమాః, హే ప్రథమ, హే ప్రథమౌ, హే ప్రథమే, హే ప్రథమాః – మిగిలినది రామ శబ్దమువలె. ఇట్లే చరమః, అల్పః, అర్ధః, కతిపయః, ఏతే, ద్వయః, ద్వితయః, త్రయః, త్రితయః, చతుష్టయః, పఞ్చతయః మొ॥

స్త్రీ లింగపు 'ప్రథమా' శబ్దమును 'రమా' శబ్దమువలెను, నపుంసక లింగపు 'ప్రథమ' శబ్దమును 'జ్ఞాన' శబ్దమువలెను చెప్పుకొనవలెను.

136. అకారాన్తః పుం లింగః 'ద్వితీయ'శబ్దః – రెండవవాడు. ద్వితీయః ద్వితీయౌ ద్వితీయాః, హే ద్వితీయ హే ద్వితీయౌ హే ద్వితీయాః, ద్వితీయమ్ ద్వితీయౌ ద్వితీయాన్, ద్వితీయేన ద్వితీయాభ్యాం ద్వితీయైః, ద్వితీయస్మై, ద్వితీయాయ ద్వితీయాభ్యాం ద్వితీయేభ్యః, ద్వితీయస్మాత్, ద్వితీయాత్ ద్వితీయాభ్యాం ద్వితీయేభ్యః, ద్వితీయస్య ద్వితీయయోః ద్వితీయానామ్, ద్వితీయస్మిన్, ద్వితీయే ద్వితీయయోః ద్వితీయేషు॥ ఇట్లే తృతీయః మొ॥

137. ఆకారాన్తః స్త్రీ లింగో 'ద్వితీయా' శబ్దః – రెండవది. ద్వితీయా ద్వితీయే ద్వితీయాః, ద్వితీయాం ద్వితీయే ద్వితీయాః, ద్వితీయయా ద్వితీయాభ్యాం ద్వితీయాభిః, ద్వితీయస్యై, ద్వితీయాయై ద్వితీయాభ్యాం ద్వితీయాభ్యః, ద్వితీయస్యాః, ద్వితీయాయాః ద్వితీయాభ్యాం ద్వితీయాభ్యః, ద్వితీయస్యాః, ద్వితీయాయాః ద్వితీయయోః ద్వితీయానామ్, ద్వితీయస్యాం, ద్వితీయాయాం ద్వితీయయోః ద్వితీయాసు॥ ఇట్లే తృతీయా మొ॥ నపుంసక లింగపు 'ద్వితీయ' శబ్దము జ్ఞానశబ్దమువలె.

---

సంస్కృతమున ప్రతి ధాతువునకు పది లకారములు గలవు. ఇట మచ్చునకై పది లకార రూపముల పరస్మైపది, ఆత్మనేపదులలో నిచ్చితిమి.

## గద–వ్యక్తాయాం వాచి–భ్వాది (పరస్మైపది) :

1. లట్–గదతి గదతః గదన్తి । గదసి గదథః గదథ । గదామి గదావః గదామః॥

2. లిట్_జగాద జగదతుః జగదుః । జగదిథ జగదథుః జగద జగాద, జగద జగదివ జగదిమ॥

3. లుట్_గదితా గదితారౌ గదితారః । గదితాసి గదితాస్థః గదితాస్థ । గదితాస్మి గదితాస్వః గదితాస్మః॥

4. ల్ఋట్_గదిష్యతి గదిష్యతః గదిష్యన్తి । గదిష్యసి గదిష్యథః గదిష్యథ । గదిష్యామి గదిష్యావః గదిష్యామః.

5. లోట్_గదతు, గదతాత్ గదతాం గదన్తు । గద, గదతాత్ గదతం గదత । గదాని గదావ గదామ॥

6. లఙ్_అగదత్ అగదతాం అగదన్ । అగదః అగదతం అగదత । అగదం అగదావ అగదామ॥

7. విధిలిఙ్_గదేత్ గదేతాం గదేయుః । గదేః గదేతం గదేత । గదేయం గదేవ గదేమ॥

8. ఆశీర్లిఙ్ - గద్యాత్ గద్యాస్తాం గద్యాసుః । గద్యాః గద్యాస్తం గద్యాస్త । గద్యాసం గద్యాస్వ గద్యాస్మ॥

9. లుఙ్ - అగదీత్ అగదిష్టాం అగదిషుః । అగదీః అగదిష్టం అగదిష్ట । అగదిషం అగదిష్వ అగదిష్మ॥

10. ల్ఋఙ్ - అగదిష్యత్ అగదష్యతాం అగదిష్యన్ । అగదిష్యః అగదిష్యతం అగదిష్యత । అగదిష్యం అగదిష్యావ అగదిష్యామ॥

ఈక్ష దర్శనే-భ్వాది (ఆత్మనేపది) :

1. లట్ - ఈక్షతే ఈక్షేతే ఈక్షన్తే । ఈక్షసే ఈక్షేథే ఈక్షధ్వే । ఈక్షే ఈక్షావహే ఈక్షామహే॥

2. లిట్ - ఈక్షాంచక్రే ఈక్షాంచక్రాతే ఈక్షాంచక్రిరే । ఈక్షాంచకృషే ఈక్షాంచక్రాథే ఈక్షాంచకృఢ్వే । ఈక్షాంచక్రే ఈక్షాంచకృవహే ఈక్షాంచకృమహే॥

3. లుట్ - ఈక్షితా ఈక్షితారౌ ఈక్షితారః । ఈక్షితాసే ఈక్షితాసాథే ఈక్షితాధ్వే । ఈక్షితాహే ఈక్షితాస్వహే ఈక్షితాస్మహే॥

4. ల్రుట్ - ఈక్షిష్యతే ఈక్షిష్యేతే ఈక్షిష్యన్తే । ఈక్షిష్యసే ఈక్షిష్యేథే ఈక్షిష్యధ్వే । ఈక్షిష్యే ఈక్షిష్యావహే ఈక్షిష్యామహే॥

5. లోట్ - ఈక్షతాం ఈక్షేతాం ఈక్షన్తాం । ఈక్షస్వ ఈక్షేథాం ఈక్షధ్వం । ఈక్షై ఈక్షావహై ఈక్షామహై॥

6. లఙ్ - ఐక్షత ఐక్షేతాం ఐక్షన్త । ఐక్షథాః ఐక్షేథాం ఐక్షధ్వం । ఐక్షే ఐక్షావహి ఐక్షామహి॥

7. విధిలిఙ్ - ఈక్షేత ఈక్షేయాతాం ఈక్షేరన్ । ఈక్షేథాః ఈక్షేయాథాం ఈక్షేధ్వం । ఈక్షేయ ఈక్షేవహి ఈక్షేమహి॥

8. ఆశీర్లిఙ్ - ఈక్షిషీష్ట ఈక్షిషీయాస్తాం ఈక్షిషీరన్ । ఈక్షిషీష్ఠాః ఈక్షిషీయాస్థాం ఈక్షిషీధ్వం । ఈక్షిషీయ ఈక్షిషీవహి ఈక్షిషీమహి॥

9. లుఙ్ - ఐక్షిష్ట ఐక్షిషాతాం ఐక్షిషత । ఐక్షిష్ఠాః ఐక్షిషాథాం ఐక్షిధ్వం । ఐక్షిషి ఐక్షిష్వహి ఐక్షిష్మహి॥

10. ల్రుఙ్ - ఐక్షిష్యత ఐక్షిష్యేతాం ఐక్షిష్యన్త । ఐక్షిష్యథాః ఐక్షిష్యేథాం ఐక్షిష్యధ్వం । ఐక్షిష్యే ఐక్షిష్యావహి ఐక్షిష్యామహి॥

భూష (భూష్) అలంకారే, సేట్, సకర్మకః

**I**. 1. భూషయతి 2. భూషయతు 3. అభూషయత్ 4. భూషయేత్ 5. భూషయిష్యతి.

**II**. 1. భూష్యతే 2. భూష్యతామ్ 3. అభూష్యత 4. భూష్యేత 5. భూషయిష్యతే.

**III**. 1. భూషిత 2. భూషయత్ 3. భూషయితుమ్ 4. భూషయిత్వా 5. విభూష్య.

---

1. 'తృచ్' ప్రత్యయము. ఇది కృత్ ప్రత్యయములలో నొకటి. ఇది వర్తమాన కాలమున కర్త్రర్థమున ధాతువుపై ప్రయోగింపబడును.

ఉదా: √ భూ - తృ (చ్) = భవితృ (భవితా)
√ కృ - తృ (చ్) = కర్తృ (కర్తా)
√ గమ్ - తృ (చ్) = గన్తృ (గన్తా).

2. 'ణిచ్' ప్రత్యయము: ఒకపని చేయుటకు కర్తకు ప్రేరణ నిచ్చువాడు ప్రయోజకుడు. పంపుట మున్నగు ప్రయోజకుని వ్యాపారము (పని) వాచ్యమగుచో ధాతువుపై 'ణిచ్' వచ్చును. ణిచ్ లో 'ఇ' మిగులును.

ఉదా √ భూ-ఇ = భౌ-ఇ = భావ్-ఇ = భావి;
భావిపై 'శప్' వికరణ ప్రత్యయము 'తిప్' = భావయతి.
√ కృ-ఇ = కార్-ఇ = కారి = కారయతి, బోధయతి మొ॥

3. 'సన్' ప్రత్యయము. ఇచ్ఛార్థమున ధాతువుపై నీ ప్రత్యయము వచ్చును. ధాతురూపములో కొంత మార్పు జరుగును.

ఉదా: గన్తుం ఇచ్ఛతి (పోవ గోరుచున్నాడు) అను అర్థమున 'సన్' పరము కాగా గమ్ ధాతువు 'జిగమ్' అను ప్రాతిపదికగ మారును. దానిపై 'ఇడాగమము' సన్ లో 'స' కారము మిగులును. శప్, తిప్ జిగమ్-ఇ-ష్-అతి (సన్ లోని సకారము షకారముగ మారినది) 'జిగమిషతి'. ఇట్లే కర్తుంఇచ్ఛ = చికీర్-ష్-అతి = చికీర్షతి; పిపఠిషతి, జిహాసతి మొ॥

4. 'వతుప్' - సాదృశ్యమును చెప్పుటకు దీనిని ఉపమానమునకు చేర్చవలెను. రామవత్, కృష్ణవత్ (వత్ తద్ధిత ప్రత్యయము).

5. 'అధీతే' (అధ్యయన మొనర్చుచున్నాడు) లేదా 'వేత్తి' (తెలిసికొనుచున్నాడు) అను నర్థములో 'అణ్' వచ్చును.

ఉదా: వ్యాకరణం అధీతే—వేత్తి వా వైయ్యాకరణః.
న్యాయం అధీతే—వేత్తి వా నైయ్యాయికః.
మీమాంసాం అధీతే—వేత్తి వా మీమాంసకః.

# తప్పొప్పుల పట్టిక

1. ఈ పుస్తకపు అచ్చు 'టైపు' లో 'వ్' 'ప్' ల భేదము చాలా సూక్ష్మముగా పడినది. తేడాలను జాగ్రత్తగ పరికించి నిర్ణయించుకొనగోరుచున్నాము. ప్రత్యయములు క్విప్, క్యప్, టాప్, ఏనప్, వతుప్, క్షప్. స్యప్.

2. కొన్నిచోట్ల 'సమాస' బదులు 'సమాన' అని తప్పుపడినది.

3. 27 పే. 'సన్ + శంభుః___ ___' నకు ముందు ఈ నియమము చేర్చుడు. పదాంత 'న' కారమునకు 'శ' కారము పరమైన 'తుక్' (శితుక్) వికల్పముగా నగును.

4. 29 పే 9 పం – 'అవఙ్ఞాదేశము వికల్పముగా నగును... కాగా నిత్యముగా నగును'.

5. 83–2 లో మధ్యమ పురుష ఏక వచనమున – 'జహితాత్, జహీతాత్' లను కూడ కలుపుకొనుడు.

6. 90–3 న 'లజ్' బదులు పొరపాటుగా 'లుజ్' పడినది. లజ్ రూపము లివి. 'అపినట్ అపింష్టాం అపింషన్ ॥ అపినట్ అపింష్టం అపింష్ట। అపినషం అపింష్వ అపింష్మ'॥

7. 92 వ పేజీలో గల 'న్త, న్తా, న్తే' లను 'న్త్త, న్త్తా, న్త్తే' లుగా దిద్దుకొనుడు.

8. 108 పే **iii-i** – 'కృష్ణ...' పంక్తికి బదులు 'భోజ్యంచ తత్ ఉష్ణంచ = భోజ్యోష్ణమ్ – తినదగినది, వేడియైనది (తినదగిన వేడిది) అని మార్చుకొనుడు.

9. 78 వ పే. 2–5–8 పంక్తులలోని 'ఆద్ధ్వే, ఆద్ధ్వం, ఆద్ధ్యం' లు లేవు.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 11 | తీయాయాః | తీయాయామ్ |
| 10 | 12 | జ్ఞో | జ్ఞః |

| | | | |
|---|---|---|---|
| 16 | 10 | స్సు | సు |
| 17 | 19 | తత్ | తద్ |
| 19-21 | 7, 15, 24-4 | త్' | ద్' |
| 24 | 2 | (ఆర్ | (ఆర్, అల్ |
| | 6 | ఆర్ | ఆర్, ఆల్ |
| 26 | 20 | ఞ్ | ఞ |
| 27 | 12, 15 | తచ్ఛో | తఞ్చ్ఛో |
| 27 | 14 (2) | చ్ | ఞ్ |
| | 16 | క్...త్ | గ్...ద్ |
| | 20 | విద్యా | విద్వాం |
| 28 | 4 | చత్వ | ఛత్వ |
| | 16 | నలాంగ్గ | న్లాః |
| 30 | 10 | ఞ్ఞ్చి | ఞ్చ్చి |
| | 12 | సయ్యా | సయ్యా |
| | 14 | ద్వాల్లి | ద్వాల్లి |
| | 18 (i) | రిః | రిః = వాఖ్య రిః |
| 32 | 12 | రెండి | రెంటి |
| | 14 | తిఝ్గు | తిఝ్ఝు |
| | 19 | TIAN | TION |
| | 20, 23 | ఆర్థ | ఆర్ధ |
| | 21 | NOL | NAL |
| 34 | 9 | దిన్ | దివ్ |
| | 17 | నోంది | నోంతి |
| 35 | 23 | ద్రూ | ద్లూ |
| 37 | 10 (i-iii) | ల్సవ | ల్పసవ |
| | ii | ల్సివ | ల్పి |

| | | | |
|---|---|---|---|
| 41 | 22 | లృట్ | లుట్, లృట్ |
| 48 | 24 | వ్యో | హ్యా |
| 53 | 1 | ఉది | వది |
| | 2 | వది | ఉది |
| | 20 | దీని | దీనికి |
| 56 | 4 | త్షే | హ్యే |
| | 12 | త్ | మ్ |
| 58 | 5 | సోధ | సోఢ |
| 59 | 14 | త | త్ |
| 61 | 24 | 5—, | , నర్తిష్యతి |
| | 25 | 5 | , నర్తిష్యతే |
| 66 | 21 | తుద | ఖింద |
| 71 | 23 | ఘోషి | ఘుషి |
| 72 | 5 | మాన | మాణ |
| 73 | 4 | వాది | వాచి |
| | 9 | శ్రువ | శ్రవ |
| 84 | 14 | త్ | మ్ |
| 91, 92 | 10, 2–23 | న్ధ్వ | న్ద్ధ్వ |
| 92 | 8 | నద్వ...నద్మ | న్ద్వ...న్ద్మ |
| | 23 | న్ధా | న్ద్ధా |
| 93 | 3–4 మధ్య | — | 5 భేత్స్యతే |
| | 9 | మన్వ | మను |
| 97 | 19, 21 | త...త | తి .. తే |
| 98 | 26 | యత్ | యమానః |
| 101 | 8 | జేయ | జేయు |
| | | సమానములు | సమాస_ |

| | | | |
|---|---|---|---|
| 101 | 19 | యలీ | యతీ |
| | 20 | అర్ధ | అర్ధ |
| 102 | 22 | తుల్య | యోగ్య |
| 103 | 12 | అగ్నిప్ర | అగ్నింప్ర |
| | 21 | సంప్ర | అసంప్ర |
| 105 | 14 | ధ్యా | ధ్వా |
| | 24 | అప | అవ |
| 106 | 18 | తితం | చితం |
| 107 | 9 | హీడమి | హి ఈడే ఇ |
| 110 | III-2-అర్థము | 5 గురు వంద్రుంగుల గుంపు | |
| 112 | 18, 19 | త్యా | త్రా |
| 113 | 14 | పహా | సహా |
| 115 | 8 | ట్టి | ఠ్ఠి |
| 116 | 12 | త...రతి | తః భవతి |
| 128 | 11 | ధ్యా | ధ్యా |
| | 17 | పురు | పుర |
| 129 | 21 | డవు | డవి |
| 134 | 4 | హోే్వ | హ్వా |
| 136 | 12 | ని | ణా। |
| 137 | 6 | జను | నుజ |
| 168 | 18 | ద్వాన | ద్వాశ |
| 173 | 14 | దాసి | దాస |
| 176 | 3 | పొడు | పొదు |

